# మీ స్టార్‌ని మార్చే అదృష్ట నవరత్నాలు



నందూరి శేషాచార్య

సరస్వతి పబ్లికేషన్

సత్యనారాయణ పురం, విజయవాడ - 11

# మీ స్టార్‌ని మార్చే అదృష్ట నవరత్నాలు

ప్రాచీన కాలము నుండి మానవ జాతిని రత్నములు, మణులు ఆకర్షింప చేస్తున్నాయి. వీటిలో గట్టిదనము, స్వచ్ఛత, ప్రకాశవంతముగా వుండటం శాశ్వతంగా వుండే లక్షణాలు. భయాశ్చర్యాలను కలుగజేసే వీటియొక్క శక్తుల వలన వీటిపై ఆసక్తి ఎక్కువగా కలిగే అవకాశములు మెండుగా వున్నాయి. మానవులలో నాగరికత ఎక్కువైన కొలదీ వీటి ఉనికి మానవులను విపరీతంగా ఆకర్షిస్తోందని, చరిత్రలో వీటికి అత్యుత్తమ స్థానముందని, వీటిగురించి అనేక రకమయిన కథలు, యుద్ధాలు జరిగినట్లు మన పురాతన గ్రంథాలలో, మత గ్రంథాలలో, చారిత్రాత్మక గ్రంథాలలో విపులంగా వున్నట్లు చెప్పబడింది.

వివిధ రత్నాలు, మణులు, తాయెత్తులు ధరించటం వలన క్షుద్రశక్తులు, అతీంద్రియ శక్తుల నుండి రక్షణ పొందగలమని విశ్వాసం పూర్వకాలం నాటి వారికి ప్రబలంగా వుండేది. అంతేగాక వైద్యంలో ఔషధాలుగను, అలంకరణ కొరకు, దేవతల (గ్రహముల) ప్రీతి (అనుగ్రహము) కొరకు వీటిని ఎక్కువగా ఉపయోగించేవారు.

## మనం గత చరిత్రను పరిశీలించిన...

పూర్వ కాలంలో భారతదేశానికి 'రత్నగర్భ' అనే పేరు వుండేదనీ, ఈ నాటికీ ప్రపంచములో ప్రముఖముగా చెప్పబడే వజ్రాలు భారతదేశములోనివేననీ వాటిలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన కోహినూర్, ఆర్లూఫ్, గ్రేట్, మొగల్, రోజ్ మొదలగునవి.

పూర్వకాలములో చక్రవర్తులు, మహారాజులు, తమ తమ ఆభరణాలలోను, కిరీటాలలోను, ఖడ్గములందును, సింహాసనములందు, ఇతర వస్తువులలో కూడ విరివిగా ఉపయోగించేవారు. ఈ రత్నముల గురించి వేదములందు, పురాణములలోను (అష్టాదశ పురాణములు) మహాభారత ఇతిహాసములందును, భోజమహారాజు 'యుక్తి కల్పతరువు', అగస్త్యముని 'రత్నసంహిత' వరాహమిహిరుని 'బృహత్సంహిత', ఆయుర్వేద ప్రకాశం, రసరత్న సముచ్ఛయము వంటి అనేక గ్రంథములందే గాక, తెలుగులో భైరవునిచే రచించబడిన 'రత్నపరీక్ష' లందు సంపూర్ణముగా వివరింప బడినవి.

ఈ రత్నములకు వైద్యశాస్త్రములో ప్రముఖ స్థానముండుటయే గాక రత్నములను, మణులను భస్మముగా తయారుచేసి ఔషధములలో వాడుట గురించి గరుడ పురాణము, ఇతర ఆయుర్వేద గ్రంథములలో వివరింపబడినది.

మన భారతదేశములో విశేషముగా కృషి చేసిన వారికి బిరుదు సత్కారములలో కవిరత్న, నటరత్న, దైవజ్ఞరత్న అనటం మనం గమనించగలం.

విలువ గలిగిన రాళ్ళను వజ్ర వైఢూర్యములని, రత్నములని అంటూ ఉంటారు. మనదేశములో అత్యున్నత పురస్కారము భారత రత్న. వీటి యొక్క శ్రేష్ఠతని బట్టి , ధరించడం వలన కలిగే శుభాశుభాలు, వీటి జాతుల గురించి

తెలుసుకోవడం అవసరం. మన దేశములోనే కాక ప్రపంచములో వివిధ నాగరికతల క్రీ.పూ 4000- 3000 సం॥ కాలంలోనే రత్నములు అభివృద్ధి చెందినట్లు తెలుస్తోంది.

**మెసపొటోమియా :-**

దక్షిణ ప్రాంతములో రత్నశాస్త్రము క్రీ.పూ 2800 - సంవత్సరములో ప్రాచుర్యం పొందింది. ఆ కాలంలో అర్కేడియన్ రాజు కాలంలో వీటిని రాజ ముద్రికలుగా ఉపయోగించేవారట. శిలా స్ఫటికాలను అత్యద్భుతమయిన డిజైన్లలో చెక్కి ప్రశంలందుకునేవారట. గిల్లమేష్ రాజుల కాలంలో ఈ కళ మరింత విస్తృత పరచబడినదట. ఆ కాలంలో హెమటైట్ విరివిగా ఉపయోగించేవారట. క్రీ.పూ 2100 - 1800 సంవత్సరములలో పాలించిన రాజు హెమ్మూరబి కాలంలో రత్నాలను శంకు,స్థూప, త్రిభుజాకారములో తయారు చేసేవారు. ఆ తరువాత కాలంలో మిగతా ప్రాంతాలలో కూడా విలువ గల ఆ రాళ్ళపై అనేక బొమ్మలు చేసేవారట.

**ఈజిప్ట్ :-**

వీరు ఎక్కువగా ఆభరణాలలో, ముద్రికలుగను, ఉపయోగించేవారు. వీరు తాయెత్తులుగా ఎక్కువగా వాడినట్లుగను, వీరు పిరమిడ్‌లలో, ఆభరణాలలో దేవతలకి ప్రీతి పాత్రమగుటకు కర్నీలియన్, ఎమిథిస్ట్, జేస్పర్.

**క్రీట్ :-**

గ్రీస్ దేశస్థులు కూడా క్రీట్ దేశస్థుల ప్రభావం వలనే ఉపయోగించారట. క్రీ.పూ. 3000 - 2000 కాలంలో క్రీట్ దేశం వారు- పూర్వ మినోయన్ వంశస్థుల కాలంలో ఈ రత్నశాస్త్రం అభివృద్ధి చెందింది. ఈ కాలంలో వీరు శంకువులు, త్రిభుజి, స్థూపాకారాలలో చెక్కేవారు. వీరు వాటిపై జంతువులు, ఓడ, మనుష్యుల అనేక భంగిమల్ని చెక్కించేవారు. ఆ తరువాత కాలంలో క్రీ.పూ. 1750 -1850 సంవత్సరాల కాలంలో చిత్రలిపిని అత్యుత్తమంగా చెక్కేవారుట.

**గ్రీకులు :-**

6-5 శతాబ్దాల కాలంలో వీరు ఈ శాస్త్ర పరిశోధనకు విశేష ప్రాముఖ్యతను కలిగించారు. వీరు ఆభరణాలలో, తాయెత్తులలోను, అంతేగాక, గ్రీకు పురాణదేవతా హెర్క్యులిస్ ప్రతిమను చెక్కించేవారట. అంతటితో పూరుకోక అనేక జంతువుల బొమ్మల్ని చెక్కించేవారట. ఆ తరువాత కాలంలో వారి దేవతలయిన APHRODITE, EROS,NIKE బొమ్మల్ని ప్రసిద్ధిగాంచిన రత్నముల (CHALCEDONY) పై చెక్కించారట. అంతే గాక CARNELIAL, AGATE, ROCK, CRYSTAL, JASPER, LAPISLAZULI లను ఉపయోగించినట్లు తెలుస్తోంది.

క్రీ.పూ 323 -30 ల మధ్య కాలంలో రాజుల వలన, ఆ తరువాత అలెగ్జాండర్ కాలంలో భారత దేశము ఇతర దేశాల ప్రభావం వలన అభివృద్ధి పథంలో సాగింది.

క్రీ.పూ. 6 వ శతాబ్దములో వీటిని నాణెములుగా ఉపయోగించేవారట. క్షుద్ర శక్తుల నుండి రక్షణకు ముఖం, కవచం లాంటి బొమ్మల్ని చెక్కించే వారట. వీరు ఉపయోగించిన రత్నము CHALCEDONY.

## ETQURIA :-

వీరు క్రీ.పూ 6-4 శతాబ్దాల కాలంలో గ్రీకుల నుండి నేర్చుకున్నందువలన వీరి కళారీతులు గ్రీకులకి నకలుగా వుండేవి. వీరు ఉపయోగించిన రత్నం CARNE-LIAN. వీరు కూడా గ్రీకు దేవతలయిన హోమరిక్, ధీబన్ బొమ్మలనే గాక వారి ఇతర బొమ్మల్ని కూడా చెక్కించేవారు.

## ROMANS GEM :-

వీరు వివిధ ఆకృతులలో, రూపాలు గలవి రత్నములపై చెక్కి విశేష ఖ్యాతిని పొందారు. రకరముల రత్నములు కలిగి వుండటం హోదాగా, గౌరవంగా వుండేది. వీరు అధికముగా ధనము వ్యయపరిచేవారు. రోమన్ చక్రవర్తి MARK ANTONY కోరిన రత్నము యివ్వడానికి నిరాకరించిన సెనేటర్ నోనియుస్ సామ్రాజ్యము నుండ వెలివేయబడటం, అప్పటి కాలంలో ఆ రత్నం విలువ 20,000 SESTERUESS. ఈ విధంగా సంపాయించిన వజ్రాలు, రత్నాలు, పేరు కొరకు దేవాయలములలో భద్రపరచేవారట. జూలియస్ సీజర్ చక్రవర్తి అనేక సార్లు అనేక విలువైన రత్నాలు సంపాయించి రోమన్ సౌందర్యాధి దేవత VEENUS GENETRIX దేవాలయములలో ఉంచాడని అంటారు.

వీరు ఆ కాలంలో ఉపయోగించిన వాటిలో CARNELIAN, SARD, SARDONYX, AMETHYST అంతేగాక BERYLS, TOPAZS, PERIDOT, EMARALDS, SPPHIRE లు విరివిగా ఉపయోగించేవారు. వీరిపై భారతీయుల ప్రభావం వలన కొంతమేరకు వైరుధ్యం కనపడింది.

ఆ తరువాత 1800 సంవత్సరం తర్వాత కాలంలో కృత్రిమపు వజ్రాలు, రత్నాలు పరిశోధనల ద్వారా తయారు చేయటం జరిగింది.

## భూమి లోపల... ...

భూమి పై పొర 60 మైళ్ళు ఉన్నా ఈనాడు మనం త్రవ్వ గలిగినది 5 మీటర్లే. భూమి లోపల తెలుసుకోవటం కొరకు ఆధునిక పరికరములు, కంపన తరంగముల సాయం వలన భూమికి గల సమగ్ర రూపం తెలుసుకొనగలుగుతున్నాం.

పై పొర 30 మైళ్ళు వుంది. సముద్రంలో దీని మందం 5 కి.మీ. ఈ పొర సిలికాతో నిర్మింపబడింది. ఈ పై పొరలోనే 2000 వరకు ఖనిజాలు వున్నాయట. ఇదంతా శిలామయంగా వుంటుంది. ఈ శిలలే 2 లేక 3 మూలకాల మిశ్రమంగా రూపొందేవి. మనకి లభించే రత్నాలు ఈ పొరలోనివే. వాటికే EARTH CRUST అని పేరు.

భూమి లోపలికి వెళ్ళే కొలది ఉష్ణోగ్రత పెరిగి ప్రతి అడుగుకి $1^{0}C$ చొప్పున పెరిగి, 2 మైళ్ళ లోతులో $100^{0}C$ వుండే అవకాశముంది. అదే30 మైళ్ళ లోతులో ద్రవరూపము వుంటుంది.

రెండవ పొరని MANTLE అని పిలుస్తారు. ఇది 1800 మైళ్ళ మందం గలిగి వుంటుంది. దీంట్లో ఇనుము, మెగ్నీషియమ్, ధాతువులతో కలిసి వుంటుంది. తర్వాత సల్ఫైడ్, ఆక్సైడ్ పొర, దీని తరువాత ఔటర్‌కోర్ అనే మూడవ పొర వుంటుంది. ఇది షుమారు 1300 మైళ్ళ మందం గలిగి వుంటుంది. నాల్గవ పొరనే INNER CORE అని పేరు. ఇక్కడే నికెల్, ఇనుము ధాతువులతో కలిసి వుంటుంది. ఇది 850 మైళ్ళ మందం కలిగి, 3.5 మిలియన్ల ఒత్తిడి కలిగి $8000^{0}C$ ఉండటానికి అవకాశముంది. ఇది భూమి బరువులో 30 శాతం పైనే వుంటుంది. కాని భూమి యొక్క అంతర్భాగంలో అనేక రకములయిన ఖనిజములు, రత్నములు వుండటానికి (అధిక వేడిని కూడా భరించగలిగినవి) అవకాశములున్నవని శాస్త్రజ్ఞుల భావన.

మనకు లభించుచున్న అనేక ఖనిజాలు పై పొరలోనే లభ్యమవుతున్నాయి. వీటితో రత్నాలు, మణులు కూడా లభ్యమవుచున్నాయి. ఈ ఖనిజాలు రత్నాలుగా మారటానికి కొన్ని లక్షల సంవత్సరాలు పట్టే అవకాశముంది. మనకు ఇవి 3 విధములయిన శిలలో, 3 లభిస్తున్నాయి. 1. IGENEOUS ROCKS. 2. SEDIMANTARY ROCKS. 3. METAMORPHIC ROCKS.

మనకి లభించే భూమి అంతర్భాగంలోని శిలలు, ఒక్కోసారి ప్రధాన శిల నుండి విడిన శిలలు వాతావరణములోని మార్పులకు లోనయి జల ప్రవాహములతో కలిసి నదులు, సరస్సు, సముద్రాలలో లభ్యమవుతున్నాయి.

# రత్నాలు తయారగు పద్ధతి

## 1. IGENOUS ROCKS :-

అగ్ని పర్వతములు పేలినప్పుడు భూమి అంతర్భాగములో ద్రవ రూపములో నున్న శిలలు, అధిక వత్తిడికి పీడనంతో బయటకురావటం జరుగుతుంది.ఈ విధంగా వచ్చే పదార్థము ను 'లావా' అంటారు. ఈ లావాతో పాటు బూడిద కూడా వుంటుంది. అలాంటి సమయాల్లో భూమిలోగల మధ్య పొరలలో కొంత లావా చేరి అక్కడే వుండటం వల్ల అంతర్గత చర్య వలన కాల క్రమములో కాఠిన్యత సంతరించుకుని గట్టిగా తయారవుతుంది. ఇలా జరగటానికి కొన్ని లక్షల సంవత్సరాలు గడిచిన తర్వాత అనేక మార్పులు జరిగి స్ఫటికాకృతిగా మారి విలువ గల రత్నాలుగా తయారౌతాయి. మనకు లభ్యమయ్యే రత్నాలు ఇలాంటివే. ఈ విధమయిన వాటిని INTRUSIVE ROCK అనే పిగ్మటైట్ PIGMATITE శిలలు అని అంటారు.

## 2. METAMORPHIC ROCKS :-

ఇవి ప్రకృతి శక్తుల వలన రూపాంతరము చెందినవి. ఇవి అగ్నిపర్వత శిలలు కానీ, సెడిమెంటరీ శిలలు కానీ కావచ్చు. అగ్ని పర్వతపు లావా పదార్థము ఆవిరిగా మారి విపరీతమగు వత్తిడి , అధికమయిన వేడికి గురయి మూలకపు అణువులు ఒకదానితో ఒకటి చేరి రత్నాలుగా మారగలుగుతున్నాయి. ఆ సమయాలలో దొరికే ఖనిజాలు, మూలకాల లక్షణాల ఆధారంగాను రత్నాలు ఏర్పడుతున్నాయి. ఉదా :- మైకా గనుల ప్రాంత సమీపంలో అలాంటి పరిస్థితుల వల్ల బురద, మట్టి కాలక్రమంలో గార్నెట్ అనే రత్నంగా అవకాశములు ఎక్కువగా ఉన్నాయి. సున్నపురాయి నుండి మార్బుల్ తయారవుతుంది. ఈ మార్బుల్ విపరీతమయిన వత్తిడి, అధిక ఉష్ణానికి గురి కాబడి కెంపు RUBY గా మారే అవకాశములు ఎక్కువగా వున్నాయి.

## 3. SEDIMENTARY ROCKS :-

శిలల ముక్కలు వాతావరణ పరిస్థితులకు లోనయి అనేక మార్పులు జరిగి గాలి తాకిడి రంగు మారి తర్వాత కాలంలో కొంతవరకు శిధిలమయి భూమిలో మరింత దృఢత్వము చెంది పొరల రూపం కలుగుతుంది. వీటిని సెడిమెంటరీ పొరలని పిలుస్తారు. వీటిని గృహాలకు అలంకరణ కొరకు ఉపయోగించటం జరుగుతుంది. ఆస్ట్రేలియన్ ఓవల్ ఈ ప్రకారము ఏర్పడినదే. ఈ పొరల మధ్య లభించేరత్నం TURQUISE జిప్సమ్, హేలైట్‌లను సెడిమెంటరీ రాళ్ళని పిలుస్తారు.

## 4.ORGANIC GEMS :-

వృక్షములు, జంతువుల శిథిలాల నుండి ఆవిర్భవిస్తాయి. అలాగే ఐఐజాఉఉ ఓఐఐ నుండి ముత్యములు, జంతువుల కొమ్ములు, దంతాల నుండి ఏర్పడేవే సేంద్రియ రూప రత్నములు. కొన్ని లక్షల సంవత్సరాలకి పూర్వం గల వృక్షాలు, జంతువుల కళేబరాలు కాల క్రమంలో శిథిలమయి వాటిలో గల గట్టి పదార్థములయిన ఎముకలు, దంతాలు, శిలాజాలుగా మారి శిలల మధ్య అధికమగు వత్తిడికి, ఉష్ణానికి లోనయి రత్నాలుగా మారగలవు. ఈ ప్రకారంగా ఏర్పడినవే. ఆ విధంగా ఏర్పడినవే ముత్యాలు, పగడం కూడా సేంద్రియ (ఎఫ్రస్త్రజుశ్రీష్ట్రా స్త్రజాఖఐ) రత్నాలు అనవచ్చు.

## రత్నాలు లభించే ప్రదేశాలు :-

కొన్ని రకములయిన ధాతువులు శిలాస్ఫటికము, గార్నెట్ మన ప్రపంచములో అనేక చోట్ల లభ్యమవుతున్నాయి. ఇతరములయిన పచ్చలు, వజ్రాలు దొరికే ప్రాంతాలు తక్కువ. ఇవి తయారగుటకు కావలసిన భూగోళ పరిస్థితుల వల్లనే ఈ పచ్చలు, వజ్రాలు అరుదుగా లభ్యమవుతున్నాయి. కొత్త ఖనిజము ద్వారా తక్కువ ప్రమాణంలో కొత్త రత్నం ఏర్పడటానికి తక్కువ అవకాశములున్నప్పటికీ, నేటి ప్రపంచములో వాణిజ్యపరంగా ఉత్పత్తి చేస్తూ అధిక విలువ గల 12 రకముల ముఖ్య రత్నములు, మణులు లభ్యమయ్యే ప్రాంతములు.

**వజ్రం (DIAMOND) :-**

బ్రెజిల్, బోట్సువానా, దక్షిణాఫ్రికా, జైరే, రష్యా, ఇండియా, ఆస్ట్రేలియా దేశాలలో లభ్యము కాగలవు.

**కెంపు (RUBY) :-**

ఆఫ్ఘనిస్థాన్, తూర్పు ఆఫ్రికా, బర్మా, థాయ్‌లాండ్‌లలో లభ్యమవుతాయి.

**నీలం (SAPHIRE) :-**

అమెరికా, శ్రీలంక, ఇండియా, థాయ్‌లాండ్, ఆస్ట్రేలియాలలో దొరుకుతాయి.

**పచ్చ (EMERALD) :-**

కొలంబియా, బ్రెజిల్, జాంబియా, పాకిస్థాన్‌లలో లభ్యము కాగలవు.

**బైరూజ్ (AQUA MARINE) :-**

బ్రెజిల్, మడగాస్కర్, రష్యా, ఆఫ్ఘనిస్థాన్‌లలో దొరుకుతాయి.

**క్రిసో బెరిల్ (CHRYSOBERYL) :-**

బ్రెజిల్, రష్యా, శ్రీలంక, ఇండియాలలో లభ్యముకాగలవు.

**పుష్యరాగము (TOPAZ) :-**

బ్రెజిల్, జర్మనీ, రష్యా, శ్రీలంకలలో దొరుకుతాయి.

**తరుమణి (TOURMALINE) :-**

రష్యా, బ్రెజిల్, ఇటలీ, తూర్పు ఆఫ్రికా, మెడగాస్కర్‌లలో లభ్యము కాగలవు.

**పెరిడాట్ (PERIDOT) :-**

అమెరికా, ఈజిప్ట్, బర్మా, చైనాలలో లభ్యము కాగలవు.

**ధామడా (GARNET) :-**

బ్రెజిల్, తూర్పు ఆఫ్రికా, రష్యా, ఇండియాలలో లభ్యము కాగలవు.

**ముత్యం (PEARL) :-**

చైనా, జపాన్, ఆస్ట్రేలియాలలో లభ్యం కాగలవు.

**ఓపల్ (OPAL) :-**

మెక్సికో, బ్రెజిల్, చక్, ఆస్ట్రేలియాలలో దొరుకును.

**రత్నాల లక్షణములు :-**

రత్నాలకు భౌతిక పరమయిన లక్షణాలుగలవు. 1. దృఢత్వము, 2. సాంద్రత 3.అంచుల వెంట చీలే విధానము.

మూలకం యొక్క రసాయనిక బంధంపై ఆధారపడి వుంటుంది. ప్రకృతిలో లభించే అతి గట్టి పదార్థము వజ్రము. చాలా మృదువు గలది గ్రాఫైట్. ఈ రెండింటి మూల ధాతువు కర్బనము. ఈ కర్బన నిర్మాణములో తేడాల వలనే దృఢత్వము గల వజ్రము, మెత్తనైన గ్రాఫైట్‌లు ఏర్పడుతున్నాయి.

## దృఢత్వము (HARDNESS) :-

ఘన పదార్థముల ముఖ్య లక్షణము దృఢత్వము. దీన్ని విచ్ఛిన్నము చేయగల పదార్థమునకు వ్యతిరేకంగా దానికి గల నిరోధక శక్తి RESISTANCE రూపంలో వుంటుంది. వివిధ రకములయిన పదార్థముల యొక్క దృఢత్వము మోస్ స్కేల్‌పై గానీ KNOOP నూప్ స్కేల్ పై గానీ కొలుస్తారు. ఈ స్కేల్ పై 1 నుంచి 20 వరకు సంఖ్యలుంటాయి. వీటిలో కొన్నింటిని పరిశీలించిన

| | | | |
|---|---|---|---|
| TALC | టాల్క్ | - | 1 |
| GYPSUM | జిప్సమ్ | - | 2 |
| CALCITE | కాల్‌సైట్ | - | 3 |
| FLOURITE | ఫ్లోరైట్ | - | 4 |
| APATITE | ఎపటైట్ | - | 5 |
| ORTHOCLASE | ఫెల్‌స్పార్ | - | 6 |
| QUARTZ | క్వార్ట్జ్ | - | 7 |
| TOPAZ | పుష్యరాగం | - | 8 |
| CORUMDUM | సఫైర్ | - | 9 |
| DIAMOND | వజ్రం | - | 10 |

అన్నింటిలోకి వజ్రం దృఢత్వము కలది.

వివిధ రకములయిన రత్నములకు, ఖనిజములకుఈ మోస్ పద్ధతి ద్వారానే దృఢత్వము నిర్ణయిస్తారు. ఇదే ఖచ్చితమయిన సంఖ్యగాను తీసుకోరు. వివిధ రకములయిన వజ్రాలని పరిశీలించినప్పుడు ఈ పది పదార్థముల శాంపిల్స్‌తో పరిశీలిస్తారు.

దృఢత్వము సంఖ్య 1 గల దానిని గోటితో చిదమవచ్చు. 2 గల దానిని గోటితో గీరవచ్చు. 3 గల దాన్ని ఏదైనా నాణెముతో ఛిద్రము చేయగలం, 4 గాజుతో, 5 పెన్‌నైఫ్‌తో, 6 క్వార్ట్జ్, 7 ఇనుపకత్తి , 8 కోరండం, సఫైర్, 9 డైమండ్, 10 అత్యంత గట్టి పదార్థం.

## సాంద్రత :-

సాంద్రత అనేది బరువుకు, ఘనపరిమాణమునకు మధ్య గల నిష్పత్తిని తెలియజేయగలదు. ప్రఖ్యాతి గల ఆర్కిమెడిస్ సూత్రము ఆధారముగనే సాంద్రత నిర్ణయించబడగలదు. ఒకే పరిమాణము గల ఏ రత్నములు ఒకే బరువు వుండవు. వీటిని నీటిలో ముంచినప్పుడు మాత్రమే వాటి పరిమాణము గల నీరు బయటకు రావటం జరుగుతుంది. వివిధ రకములయిన రత్నములను నీటిలో ముంచినప్పుడు నిర్ణయించబడే సాంద్రతను S.G అంటారు.

| | | |
|---|---|---|
| పైరేట్ | PYRITE | 5.2 |
| ఫ్లొరైట్ | FLOURITE | 3.18 |
| కెంపు | RUBY | 1.0 |
| పచ్చ | EMARALD | 2.71 |
| వజ్రము | DIAMOND | 3.52 |

## అంచుల వెంట చీలికలు CLEAVAGE AND FRACTURE :-

వివిధ రకములయిన రత్నములు గానీ, మణులుగానీ చిన్నవిగా పగలగొట్టినప్పుడు గానీ అంచులు కట్ చేయు సందర్భాలలో గానీ రెండు రకములుగా బీటలు పడే అవకాశములున్నాయి.

## CLEAVAGE :-

అణు నిర్మాణంలోని లోపాల వల్ల వివిధ రకములయిన రత్నములపై నిలువుగా గానీ, అడ్డముగా గానీ చారలు వచ్చే అవకాశములు ఎక్కువ. అవి ఏ దిక్కులో వుంటాయనేది ఆ రత్నము యొక్క అణు నిర్మాణంపై ఆధారపడి వుంటుంది. వీటిని అనుసరించి కొద్దిపాటి వత్తిడితో మనకి కావలసిన ఆకారములోకి ఖచ్చితముగా మార్చుకోగలం.

ఈ ప్రకారంగా ఖచ్చితంగా అంచుల వెంట చీలే రత్నాలు, వజ్రం, ఫ్లొరైట్, TOPAZ, CALCITE, SPODUMENE.

అణు నిర్మాణంతో ఎటువంటి సంబంధము లేకుండా అంచుల వెంట చీలికలు గల దాన్నే FRACTURE అని అంటారు.

ఈ ప్రకారంగా వుండే బీటలు సమానముగా వుండక ఎగుడుదిగుడుగా వుండటమే గాక స్థిరమయిన ఆకారములో కూడ వుండవు.

## వీటిలోని రకములు :-

ఎగుడు దిగుడుగా వుండే బీటలు(HACKEY FRACTURE) బంగారములోను, నిలువుగా పొడవుగా వుండే బీటలు (SPLIENTARY FRACTURE) NEPHRITE లోను , శంకువులుగా, గుండ్రముగా వుండే బీటలు(CONCHORIDAL FRACTURE) ABSIDAN లోను సమతలంగా లేకుండా వుండే బీటలు(UNEVEN FRACTURES) DUMORTIENITE లోను వుండే అవకాశముంది.

## DOUBLE REFRACTION :-

ఘనం(CUBIC) కాక ఆకారాల్లో గల స్ఫటికా(రత్నాలు)లలో ప్రవేశించే తెల్లని కాంతి ఎరుపుగాను, ఊదా రంగులుగను విడిపోయి ప్రయాణించగలవు. వీటి

వేగం కూడా విడిగానే వుంటుంది. ఈ రెండు కిరణాల వక్రీభవన గుణకం గరిష్ఠ, కనిష్ఠ వేగాల నిష్పత్తిని సూచింపగలదు.

## REFRACTIVE INDEX :-

వక్రీభవన సూత్రాలలో ఒకటి ఉపరితలాన్ని (రత్నాన్ని) తాకే కిరణము (INCIDENT RAY) కాగా రెండవది యానం (రత్నం) లోకి ప్రవేశించే కిరణము(REFRACTED RAY) ఒకే తలంలో వుండే అవకాశముంది.

ఉపరితలాన్ని తాకే కిరణం కోణం(SIN) వక్రీభవన కోణం సైను మధ్య నిష్పత్తి ఎప్పుడునూ స్థిరాంకమే. ఈ స్థిరాంకము యాన పదార్థములపై ఆధారపడే వుంటుంది. దీనినే రెండు యానాలు వక్రీభవన గుణకం అంటారు.

## CRYSTAL STRUCTURE :-

ప్రత్యేకమయిన ఆకారం కలిగినదే స్ఫటికము. ఉప్పు, పంచదార ఘనాలు కూడా వివిధ ఆకృతులలో వుంటాయి. నున్నటి ఉపరితలం, నునుపు గల అంచులు, మూలకాలలో వివిధ ఆకృతులలో ఈ స్ఫటికాలు ఉంటాయి.ఒక పదార్థము స్ఫటిక రూపంలోపెరగటాన్నే స్ఫటికీకరణము (CRYSTALISATION) అని అంటారు. స్ఫటికీకరణము చెందని దాన్ని 'ఎమార్ఫస్' అని అంటారు.

పరమాణువుల సంయోగ విధానం వల్లనే స్ఫటికాల రూపం, ఆకారం వుంటాయి. స్ఫటికంలోనూ అణువులు ఒక పొరపై మరొక పొరగా అనేక పొరలుగా వుంటాయి. అందువల్లనే స్ఫటిక తలాలు నునుపు తేలి వుంటాయి. ఈ విధంగా ఏర్పడే విధానము 'లా టైస్' (LATICE) అని పేర్కొనటం జరిగింది.

స్ఫటికాలు తలాలు, మూలలు, కోణాలను బట్టి వివిధ ఆకారాలుగా విభజించారు.

ఘనం (CUBIC) ఘనాకారములో మూడుతలాలకి ఒకే పొడవు వుంటుంది.

ఇవి మూడు రకములు: అవి

సాధారణ ఘనము (SIMPLE CUBIC)

కేంద్రిత ఘనము (BODY CENTERED CUBIC)

ఫాల కేంద్రిత ఘనము (FACE CENTERED CUBIC)

దీర్ఘ చతురస్రము (TETRAGONAR)

ప్రక్కనుండే తలాలు దీర్ఘ చతురస్రంగను, పైన కింద తలాలు చతురస్రాకారములో వుంటాయి. వీటికి 3 సమ భుజాలు కలిగి వుంటాయి. ఉదా ॥ రూటైల్

## స్థూపాకారం (ORTHO RHOMBIC) :-

దీనికి మూడు భుజాలు వుంటాయి. అవి కొలతలు మాత్రం వేరు వేరుగనే వుంటాయి. ఉదాహరణ పుష్యరాగం.

**మోనో క్లినిక్ (MONO CLINIC) :-**

ఒకే పద్ధతిలో కాకుండా విషమంగా 3 భుజాలు కలిగియున్న ఏ రెండు లంబ కోణాల వద్ద వుండవు. ఉదా ॥ బొరాక్స్.

**ట్రై క్లినిక్ (TRI CLINIC) :-**

మూడు అసమ భుజాలు వుంటాయి. వీటిలో ఏది కూడా లంబకోణములు చేయవు. ఉదా ॥ పొటాషియం, డైక్రోమేట్.

**హెక్సోగోనల్ (HEXOGONAL) :-**

ఆరు భుజాలు కలిగి వుంటాయి. ఉదా ॥ బిరైల్.

**రాంబో హైడ్రాల్ (RAMBO HYDRAL) :-**

మూడు సమ భుజాలు, మూడు సమ కోణాలు కలిగి వుంటాయి. ఉదా ॥ కోల్సైట్

**రూపము :-**

రత్నం విల్వు నిర్ణయించేటప్పుడు దాని లక్షణాలతో పాటు దానికుండే డిజైన్ ప్రముఖ పాత్ర వహిస్తుంది. ఒకరత్నంలోకి కాంతి కిరణము పరావర్తనం చెందినపుడు ఆ కాంతి ఎన్ని కోణాలలో పరావర్తనం చెందిన అంత కాంతివంతముగా కనిపిస్తుంది. అది ఆ రత్నం యొక్క కోణాలపైనే ఆధారపడి వుంటుంది. ప్రతి రత్నం కూడా నిర్ణీత కోణాలపై లేదా ముఖాలపై కోసినప్పుడే అద్భుతమయిన కాంతిని వెదజల్లగలవు.

ఆ కోసే విధానమే FACETING అని అంటారు.

నిపుణత్వము గల వారు, అనుభవము ఎక్కువగా నున్నవారు మాత్రమే ఈ పని చేయగలరు. రత్ననిపుణులు ఈ రకమయిన నిర్మాణమే పరిశీలించి పరీక్షిస్తారు.

అంతేగాక ఈ విధముగా చేసేటప్పుడే ఆ రత్నం యొక్క స్వచ్ఛత, రంగు, బరువుకూడా ప్రముఖ పాత్ర వహిస్తాయి. అందుకనే బరువుని దృష్టిలో వుంచుకునే ఈ కోణాలు కోయాలి. ఈ ముఖాల్ని కోసేటప్పుడు రేఖా గణిత సూత్రాలకి అనుగుణంగా, వీలయినన్ని ఎక్కువ ముఖాలు వుండేలా కట్ చేయటం వలన ప్రతి ముఖం ద్వారా కొంత ప్రతిఫలించి ప్రకాశవంతమయిన వెలుగు వస్తుంది. ఈ రత్నాల మెరుపులు కళ్ళను చెదరగొట్టే అవకాశముంది. ముడి రత్నము కోసి సాన పెట్టటం వరకు అనేక దశలలో పని జరుగుతుంది. కాని ఈ స్పీడు యుగంలో మనిషి అవసరం లేకుండా పనిచేసే రోబోట్స్, వాటిని నియంత్రించగలగటానికి , నూతన డిజైన్లు కనుగొనటానికి అత్యాధునిక కంప్యూటర్లు విరివిగా ఉపయోగించటం జరుగుతోంది. ప్రతి రత్నముగానీ, వజ్రముగానీ ఒకే విధంగా వుండవు. వీటి బరువు కోల్పోకుండా మంచి ఆకారములో వుండేలా కోయాలి.

## బ్రిలియంట్ కట్ (BRILLIANT CUT) :-

ఈ డిజైన్ అత్యంత ప్రాచుర్యం పొందింది. ఎక్కువగా వజ్రములను, ఈ డిజైన్‌లోనే కోస్తారు. అందువల్ల పూర్తిగా కాంతి ప్రతిఫలించి ప్రకాశవంతమయిన వెలుగు విరజిమ్మబడుతుంది.అయితే రత్నాలన్నీ ఒకే రకంగా వుండవు. కనకనే వాటి ఆకారాల్లో కట్ చేసే విధానాల్లో మార్పులు. అవి. ROUND, OVAL, PENDELOQUE, MARQURSE.

## ROSE CUT :-

ఇది చాల పురాతనమయినది.

## ANTWEREP CUT :-

12 కంటే ఎక్కువ ముఖాలుండి షట్కోణంగా వుంటుంది.

## STEP CUT :-

ప్రత్యేకంగా రంగు రాళ్ళకీ, చతురస్రంగను దీర్ఘచతురస్రము గను కట్ చేస్తారు. పచ్చలు, నీలాలు ఈ విధముగనే చేస్తారు.

## MIXED CUT :-

గుండ్రముగను, గోపురంలాగా చెక్కుతారు. కలిపి చెక్కబడేవి.

## FANCY CUT :-

సంప్రదాయ పద్ధతులలో కాక వేరే విధంగా చెక్కేవి. త్రిభుజాకారంగను, గాలి పటాలుగను, పంచ ముఖాలుగను, షట్కోణముగను, డైమన్ ఆకారంలోను కట్ చేయబడేవి.

అంతే గాక (A) CAMEO విభిన్న పొరలు గల సార్డోనిక్స్, అగేట్ వంటి శిలలలో అడుగు పొరల్ని నేపథ్యంగా ఉంచి పై పొరపై ఉబ్బెత్తుగా చెక్కటం, (B) INFALGIO కఠిన పదార్థములపై డిజైన్లు, తాయెత్తులు, బొమ్మలు లాంటివి చెక్కటం, (C) CABOCHON మెరుగు పెట్టటం (కోత అవసరం లేకుండా మెరుగు పెట్టటం, (D) BEAD - కంఠహారంలో పూసలుగా చెక్కి ఉపయోగించడం.

## ఈ రత్నాలు మణుల తూకం :-

పూర్వకాలం ఆవగింజలు, గురివింద గింజలు, ధాన్యపు గింజలు తూనికకి ఉపయోగించేవారు. అంతే కాక తండులము, మాషము, సువర్ణము, రూపము, శాణము, కృష్ణలము, ధరణము, రతులు, నిష్కము, మంజులము లాంటివి ఉపయోగించేవారు. ఇవి వివిధ దేశాలలో అనేక ప్రాంతాలలో వేరు వేరు రకములుగా వుండేవి. పాశ్చాత్య దేశాలలోని వారు TROY అనే తూనిక అమలులో వుండేది. మణులను, రాళ్ళను ఈ విధముగనే తూచేవారు.

పౌండ్, అవున్సులు, టాయ్ గ్రెయిన్‌ల పద్ధతి తర్వాత కాలంలో 1913 సంవత్సరములో (ఒక మెట్రిక్ క్యారెట్ = 0.200gms = 200mg) క్యారెట్ అనే మానం

ఉపయోగించారు. ఒక గ్రాములో 5 వంతు క్యారెట్ అని పిలవటం జరిగింది. అతి విలువ గల బంగారము, వెండి లోహాలను వీటి స్వచ్ఛత కొరకు క్యారెట్ అనే పదం ఉపయోగించటం జరిగింది. స్వచ్ఛమయిన బంగారము 24 క్యారెట్లు. ఆభరణాలలో మాత్రం బంగారము ఉపయోగించేది 18 లేదా 22 క్యారెట్లు మాత్రమే.

## నవరత్నాలు (NINE GEMS)

మన భారతావనిలో కొన్ని వేల సంవత్సరాలకి పూర్వం దాదాపుగా 22 రత్నాలని గుర్తించబడినట్లు వరాహవిహరుని 'బృహత్సంహిత' లో చెప్పబడింది.

వజేంద్ర నీల మరకతర్కేతర పద్మరాగరుధిరాఖ్యాః
వైఢూర్యపులక విమలక రాజమణి స్ఫటిక శశికాన్తాః
సౌగంధిక గోమేధిక శంఖ మహానీల పుష్పరాగాఖ్యాః
బ్రహ్మమణి జ్యోతీరసస్యకముక్తా ప్రవాళాని॥

వజ్రం(DIAMOND) నీల(SAPPHIRE) మరకతము(EMARALD) గోమేధికం(AGATE) పద్మరాగము(RUBY) రక్తమణి(BLOOD STONE) వైఢూర్యం (BERYL) పులక(AMETHYST) మిమలక(VIMALAKA).

నవరత్నాలు అంటేనే తొమ్మిది అని అందరికీ తెలిసినదే.

ఈ నవరత్నాలు తొమ్మిది అని అంటారు కానీ ప్రాచీన గ్రంధాలలో రత్నాలు 22 ఉన్నాయని అంటారు కూడా. అవి

### మొదటి నవరత్నాలు :-

| | |
|---|---|
| 1. మాణిక్యము కెంపు | RUBY |
| 2. వజ్రము | DIAMOND |
| 3. ముత్యము | PEARLE |
| 4. పచ్చ (మరకతము) | EMERALD |
| 5. ఇంద్రనీలము | SAPHIRE |
| 6. వైఢూర్యము | CATS EYE |
| 7. పుష్యరాగము | TOPAZ |
| 8. పగడము | CORAL |
| 9. గోమేధికము | ZICON |

### మరి 22 ప్రాచీన గ్రంధాలలోనివి :-

| | | |
|---|---|---|
| 1. వజ్రము | 2. ఇంద్రనీలము | 3. మరకతము |
| 4. కర్కేధన | 5. పద్మరాగము | 6. రుద్రాక్ష |
| 7. వైఢూర్యము | 8. విపుల | 9. విపులిక |
| 10. రాజమణి | 11. స్ఫటికము | 12. సౌగంధికము |

13. చంద్రకాంతము 14. గోమేధికము 15. సంగము
16. మహానీలము 17. పుష్యరాగము 18. బ్రహ్మమణి
19. జ్యోతిర్రస 20. సీసగము 21. ముత్యము
22. పగడము

**వీటిలో పంచరత్నములు :-**

1. కెంపు 2. పుష్యరాగము 3. వజ్రము 4. పచ్చ 5. నీలము

**వీటిలో ఉపరత్నములు :-**

1. గోమేధికము 2. వైఢూర్యము 3. పగడము 4.ముత్యము.

ఇవే కాక 34 ఉపరత్నాలు గలవని వీటికి కూడ రత్నాల వలె శక్తి గలదని గ్రంథాలలో చెప్పబడినది. కాని మనకు వాడుకలో కేవలం నవరత్నాలే.

ఈ స్పీడు యుగంలో ప్రజలకు నవరత్నాల మోజు ఎక్కువగా వుంది. మన దేశంలోనే కాక విదేశాలలో సైతం విశేష ప్రాచుర్యం ఉంది. అక్కడ ఎక్కువగా వాడబడుతున్నాయి. విదేశాలలో దాదాపు 30 పైగా రత్నాలు వాడుకలో వున్నాయి. వాటిలో

| | | |
|---|---|---|
| 1. ఎగేట్ | AGATE | గోమేధికము |
| 2. ఏంబర్ | AMBER | పచ్చ |
| 3. ఎమితెస్టు | AMETHYST | నీలమణి |
| 4. ఎక్వామెరయిన్ | AQUAMARINE | జాతి పచ్చ |
| 5. బేరిల్ | BERYL | పచ్చ |
| 6. బ్లడ్ స్టోన్ | BLOOD STONE | చెకుముకి రాయి |
| 7. సిన్నమేన్ స్టోన్ | CINNAMON STONE | |
| 8. కోరల్ | CORAL | ప్రవాళము |
| 9. క్రిసోబెరిల్ | CHRYSO BERYL | నీలమణి |
| 10. డైమండ్ | DIAMOND | వజ్రము |
| 11. ఎమరాల్డ్ | EMERALD | మరకతమణి |
| 12. గార్‌మెట్ | GAMET | గోమేధికము |
| 13. జేడ్ | JADE | |
| 14. జాస్పర్ | JASPER | మరకతమణి |
| 15. లాపిస్ లాజులి | LAPIS LAZULI | వైఢూర్యము |
| 16. మూన్‌స్టోన్ | MOON STONE | మౌక్తిక మణి |
| 17. ఆనిక్స్ | ONYX | గోమేధికము |

| | | |
|---|---|---|
| 18. ఓపల్ | OPAL | మౌక్తిక మణి |
| 19. పెరల్ | PEARL | ముత్యము |
| 20. క్వార్జ్ | QUARTZ | శిలా స్ఫటిక రత్నము |
| 21. రుబీ | RUBY | కెంపు |
| 22. సఫైర్ | SAPPHIRE | నీలం |
| 23. సార్డోనిక్స్ | SARDONYX | గోమేధిక రత్నము |
| 24. స్పినెల్ | SPINAL | కెంపు రత్నము |
| 25. టైగర్స్ ఐ | TOGER'S EYE | వైఢూర్యమణి |
| 26. టోపాజ్ | TOPAZ | పుష్యరాగము |
| 27. టూర్మలైన్ | TOUR MALINE | తోరమల్లి రత్నము |
| 28. టర్క్వైజ్ | TURGUORISE | పచ్చ |
| 29. జిర్కాన్ | ZIRCON | గోమేధికము |
| 30. కేట్స్ ఐ | CAT'S EYE | వైఢూర్యము |

రాజమణి(QUARTZ) స్ఫటికము(CRYSTAL) శశికాన్త(చంద్రశిల) (MOON - GEM) సౌగంధిక(SAUGANTHIKA) గోమేధిక(OPAL) శంఖ (COACH) మహానీల(AZURE - STORE) పుష్యరాగం(TOPAZ) బ్రహ్మమణి (BRAHMA - GEM) జ్యోతిరస(JYOTEORASA) సస్యక(SASYAKA) ముక్తా(PEARL) ప్రవాళని(CORAL).

అయినా తర్వాత కాలక్రమంలో 84 రకముల రత్నాలు, ఇతర దేశాలలో 120 రకముల రత్నాలు కనుగొనుట జరిగింది.

**ముందు నవరత్నాల గురించి ....**

## ఏ రత్నం ఏ నెలలో పుట్టిన వారు ధరించాలి

| | | |
|---|---|---|
| గార్నెట్ | GARNET (OR)<br>CIRNNE MOON STONE | జనవరి |
| ఎమిటెస్టు | AMETHYST (OR)<br>YELLOW TOPAZ | ఫిబ్రవరి |
| ఎక్వామెరైన్ | AQUAMARINE | మార్చి |
| వైఢూర్యము | CAT'S EYE | ఏప్రియల్ |
| పచ్చ | EMERALD | మే |
| ముత్యము | PEARL | జూన్ |
| కెంపు | RUBY | జులై |

| | | |
|---|---|---|
| నక్షత్ర నీలము | STAR SAPPHIRE | ఆగస్టు |
| ఇంద్రనీలము | BLUE SAPPHIRE | సెప్టెంబరు |
| చంద్రకాంత మణి | MOON STONE | అక్టోబరు |
| పుష్యరాగము | YELLOW TOPAZ (OR) AQUAMARINE | నవంబరు |
| పచ్చ | TURGUORSE | డిసెంబరు |

# 1. కెంపు (RUBY)

HARDNESS - 9 గురుత్వము - 4.03

ఇది కురువిందం, స్ఫటికామ్ల జనిత లోహ జాతికి చెందినటువంటిది.

అత్యంత విలువ గలిగిన మణి. దీన్ని సూర్యునికి ప్రతీక అని గ్రంథాలలో చెపుతారు. దీనికి పద్మరాగమణి, మాణిక్యం అని అంటారు కూడ.

'బృహత్సంహిత' లో మూడు రకములుగా లభించవచ్చని తెలియజేయబడింది. గంధకము, కురువిందము, స్ఫటికాలలో ఉద్భవిస్తుందనీ, గంధకము నుండి పుట్టినవి పెళుసుగను, Rose - Apple రంగులలో, మిణుగురు పురుగుల వలె కాంతిని విరజిమ్మగలవని చెప్పబడినవనీ, కురువిందము నుండి లభ్యమయినవీ, ఇతర మూలకాలతో కలిసి కాంతి హీనముగను, పాలిపోయిన రంగులలో వుంటాయి. స్ఫటికము నుండి వుద్భవించినవి స్వచ్ఛముగా, కాంతివంతముగా, వివిధ వర్ణాలలో వుంటాయని చెప్పటం జరిగింది.

గులాబి వంటి ఎర్రదనము కలిగే కెంపులు మృదువుగను, కాంతులు విరజిమ్ముతూ, మెరుస్తూ, బరువుగను, చక్కని ఆకారము కలిగి వుంటాయి.

కెంపులను కొలిమి వద్ద అత్యధిక వేడి వద్ద వేడి చేసినను అది ఆకుపచ్చ రంగులోకి మారి, చల్లారిన తర్వాత సహజసిద్ధమయిన రంగులోకి మారుతుంది.

మనకు ప్రకృతిలో లభ్యమయ్యే కెంపులు ముఖ్యముగా ఆరు రకములు అని 'రత్నపరీక్ష' గ్రంథములో చెప్పబడింది.

| | |
|---|---|
| ఉదయించే సూర్యబింబము వలె ప్రకాశించునది | పద్మరాగము. |
| దానిమ్మ పూవు వలె ప్రకాశించేది | సౌగంధికము |
| కోకిల నేత్రం వలె ప్రకాశించేది | కురువిందము |
| కుందేలు మాంసంలా ప్రకాశించేది | మాంసగంధి |
| నలుపు కలిసిన ఎరుపు రంగులో ప్రకాశించేది | నీలగంధి |
| పావురం మెడలోని గులాబి రంగులా ప్రకాశించేది | కోమలం |

మన భారతీయులకి కొన్ని వేల సంవత్సరాలకి పూర్వమే ఎరుపు రంగులో ఇన్ని తేడాలున్నాయని గుర్తించబడింది. పాముల శిరస్సులపై కెంపులుంటాయని అవి నెమలి పింఛము, మిణుగురు పురుగుల కాంతి వలె నిప్పు కణికలుగ

ప్రకాశించగలవనీ వీటి వెల ఊహకందని రీతిలో వుంటుందనీ, వరాహమిహిరుని 'బృహత్సంహిత'లో చెప్పబడింది.

చక్రవర్తులు ధరించిన విషప్రయోగాల నుండి రక్షణ పొందగలరనీ, శత్రువులపై సదా విజయులై వుంటారనీ, రాజ్యం సస్యశ్యామలంగ వుంటుందనీ చెప్పబడింది.

ఈ కెంపు యొక్క శక్తి వలన తమ బాధలు పోగలవనీ గ్రంథములలో పేర్కొన్నారు.

## కెంపులో గల దోషాలు :-

ఈ కెంపులో గల దోషాలను గుర్తించి దోషములు గల వాటిని ధరించరాదు.

★ 'పటలం' దోషం గలవి పాలుపోసినట్లు తెలుపు రంగు కలది ధరించిన దరిద్రము కలిగే అవకాశముంది.

★ 'త్రాస' దోషం గలవి పగిలినట్లుగను, బీటలు పడి వుండేవి ధరించిన కలహములు వచ్చే అవకాశముంది.

★ 'ఛిన్న ' దోషము గలవి చిన్న చిన్న ముక్కలుగను వుండేవి ధరించిన కష్టాలు ప్రాప్తించే అవకాశములెక్కువ.

★ 'జర్ఘర ' దోషము గలవి పొరలు పొరలుగా వుండేవి ధరించిన విరోధము వచ్చే అవకాశములు ఎక్కువ.

★ 'కర్కశ' దోషము గలవి మొద్దుగను, ఆకర్షణ తక్కువగను వుండేవి ధరించిన ప్రాణాపాయం కలిగే సూచన.

★ 'నీల' దోషము గలవి నల్లని మచ్చలు గలవి ధరించిన శత్రువులు వృద్ధి చెందటం, ఉపద్రవాల వంటి బాధలు కలిగే అవకాశముంది.

## కెంపులలో జాతులు :-

తెలుపుగా వుండి ప్రకాశించేది పద్మరాగము బ్రాహ్మణ జాతిది, గురువింద, సింధూరము వలె మిక్కిలి ఎర్రగా వుండి ప్రకాశించునది కురువిందము క్షత్రియ జాతిది, ఎరుపు, ఆకుపచ్చల మిశ్రమము గలదిగను, ఇంగిలీకము వలె ఉండునది వైశ్యజాతిది, ఎరుపుగ వుండి ప్రకాశము లేక ఎరుపు, నలుపు కలిసినట్లు వుండేది శూద్రజాతిది.

పద్మరాగమును కొలిమిలో పెట్టి బాగా వేడి చేసిన దాని సహజ ఎరుపు రంగు కోల్పోయి, ఆకుపచ్చగా మారును. ఆ వేడి చల్లారిన తర్వాత యథాస్థితికి మారగలదు.

జాతి కెంపులు పై భాగము నునుపుగా వుండి నిర్మలమయిన కిరణములతో ప్రకాశించును. లోపల భాగముపై కాంతి వుండును.

దీపమువలె వెలుగును ప్రకాశింపజేయురత్నము పాము పడగపై వుంటుంది. అటువంటి రత్నము దొరకటం కష్టము. అది అమూల్యమయినది. కెంపులు ఎక్కువగా వజ్రపు గనులలో లభించ గలవు. సింహళము (శ్రీలంక) లో నదుల యిసుకలోనూ,

తరచుకంకర రాళ్ళలోను, లభ్యమగును. కెంపు చాల గట్టిగా వుంటుంది. ఒక పక్క నుండి చూసిన రెండవ వైపు కనపడుతుంది. అర చేతిలో పెట్టుకుని చూసిన అర చేతిలో గీతలు కనపడగలవు.

## అదృష్టమును కలిగించే రత్నము (LUCKKY STONE) :-

రత్నములు ధరించుటలో అనేక విధములు శాస్త్రములలో చెప్పబడింది. ఒక్కో ప్రాంతములో ఒక్కో విధానము ఆచారములో వుంది. మన దేశములో ఎక్కువగా జన్మ నక్షత్రమును బట్టి రత్నములు ధరిస్తున్నారు.

కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢలలో జన్మించిన వారు కెంపు ధరించాలి.

కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢల వారికి అధిపతి రవి. రవికి ప్రీతి పాత్రమయినది కెంపు. అందువలన ఈ మూడు నక్షత్రముల వారు కెంపు అదృష్ట రత్నముగా ధరించవచ్చు.

## కెంపు ధరించిన ప్రయోజనములు :-

కెంపు రత్నమునకు అధిపతి రవి. జ్యోతిషశాస్త్ర ప్రకారం రవి ఆరోగ్యమును కాపాడువాడు. అందువలన అనారోగ్యము గల వారికి, రోగముల బారి పడి అవస్థలు పడుచున్న వారికి కెంపు ధరించిన ఆరోగ్యము కలుగును. ఆయుర్వృద్ధి కలిగే అవకాశముంది. ధన లాభము కలుగును. ఉద్యోగ వ్యాపారాలలో అభివృద్ధి, ఆనందము కలుగును. అత్యున్నత స్థానము అలంకరించ గలరు. మందబుద్ధి తొలగి పోవును. ఎంతో కాలముగా వున్న జ్వరములు తగ్గగలవు. పిడకల దాలి (అగ్ని) లో వేసి భస్మము చేసి శాస్త్రోక్తముగా ఆయుర్వేద శాస్త్రము ప్రకారము భస్మము చేసిన సేవించిన అతి మూత్ర వ్యాధి పొగొట్టును. నేత్ర రోగములు నశింపగలవు. నపుంసక శక్తి తొలగి సంభోగ శక్తి కలిగే అవకాశముంది.

చెవుడు (అనగా వినపడకపోవుట) నయము కాగల అవకాశముంది. శిశువులు ధరించిన ఆరోగ్యము బాగుండును. ప్లేగు లాంటి వ్యాధికి ఉపశమనము కలిగించును. ముక్కు రంధ్రము నుండి రక్తము ధారాపాతముగా కారుచున్న ఇది ధరించిన ఉపశమనము కలగజేయును. దంత వ్యాధులను అరికట్టును. దీనిని ధరించిన వారికి సంభోగశక్తి పెరగగలదు. పక్షవాతము, మల బద్ధకము, స్త్రీలకు బహిష్టు దోషములకు, అపస్మారకము, హిస్టీరియా లాంటి అనారోగ్యములు తొలగిపోవు అవకాశములున్నవి. చర్మవ్యాధులు, కీళ్ళ వాతము, మోకాళ్ళనొప్పులు, రాత్రులు సరిగా నిద్ర పట్టక పోవటం మొదలయిన అనారోగ్య పరిస్థితులు తొలగుటకు అవకాశముంది. దురభ్యాసములు గలవారు ధరించిన వారికి దురభ్యాసములపై ఆసక్తి నశింపగలదు. మేధాశక్తినీ, వాగ్ధాటినీ, సమయస్ఫూర్తితో మాట్లాడ గల నేర్పు అలవడే అవకాశముంది. శరీరములో గల రక్త ప్రసరణకు శక్తిని కలగజేయును. ఉష్ణ జ్వరములను నియంత్రించగలదు. తేలు, పాములను దరి జేరనివ్వదు.

రాజకీయములలోగానీ, కోర్టు వ్యవహారములలో గానీ ఇది ధరించిన విజయము సిద్ధింపగలదు. కళలు, సంగీతము, కవిత్వములలో ప్రావీణ్యతను కలగజేయును. ధైర్య సాహసములు, స్థిరచిత్తము, పట్టుదల, ఆత్మగౌరవములను, ఆలోచనలను వృద్ధి చేయగలదు. ప్రాచీన కాలమున ఈ రత్నము అమిత పవిత్రమయినదిగను, మహాప్రభావము కలదిగా యోగీశ్వరులు పేర్కొనటం జరిగింది. దీనిని ధరించిన వారు బహుదూరప్రదేశములలో జరుగువిషయములు తెలుసుకొను శక్తి సామర్థ్యములు కలిగివుండేవారు. భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో జరుగు విషయములు తెలుసుకొనుటకును అమోఘమయిన శక్తులు కలిగియుండుటకు కెంపు ధరించుట శ్రేష్టమయినదని ఆనాటి మునీశ్వరుల అభిప్రాయము. పూర్వకాలములో రాజులు యుద్ధమునకు పోవునప్పుడు కెంపు రత్నము ధరించి విజయము సాధించేవారట.

ఉద్యోగస్తులు ధరించిన ఉద్యోగములో ఉన్నత స్థానము అలంకరించేవారు. పై అధికారుల మన్ననలు పొందగలిగేవారు. అంతే గాక తలవని తలంపుగా ఆకస్మికముగా ప్రమోషన్లు పొందగలరు. అప్రయత్నముగా ధనలాభము కలగగలదు. విద్యార్థులు ధరించిన పరీక్షలలో విజయము గాంచగలరు. కెంపు రత్నము ధరించి వ్యాపారము చేయువారు వ్యాపారములో విశేషలాభములు గడించగలరు. అంతే గాక వ్యాపారాభివృద్ధి కలుగును. జాతకములో రవి జన్మలగ్నమునకు 6, 8, 12 స్థానములలో గానీ, నీచ స్థానమయిన తులా రాశి యందు గానీ ఉన్నప్పుడు రవి మహర్దశలో అనేక రకముల కష్టములు కలిగే అవకాశముంది. అప్పుడు తప్పని సరిగా జాతకుడు కెంపు ధరించిన కష్టములు తొలగి సుఖ జీవితము గడపటానికి అవకాశముంది. భక్తాగ్రేసరులు, మునులు, పీఠాధిపతులు తమ తమ దేవతా పీఠములందు ఉంచి పూజ చేస్తారు. రాజులు కిరీటములలో ధరించేవారు. రోగుల పాలిటి సంజీవి వంటిది కెంపు రత్నము. ఈ కెంపు రత్నము వలన వశీకరణ శక్తి, సర్వ కార్యజయము లభించగలదు.

## 2. ముత్యము (PEARL)

HARDNESS - 3.0 R.I. 1.53 - 1.68

ముత్యము చంద్రునికి ప్రతీకగా పేర్కొనటం జరిగింది.

ముత్యములు స్వచ్ఛంగా, తెల్లగా మెరుస్తూ వుంటాయి. గుండ్రముగను, బియ్యము గింజలవలే వంకరగను వుంటాయి.

ప్రకృతిలోఎక్కువగా ముత్యపు చిప్పలద్వారా లభ్యమవుతున్నాయి. ఈ ముత్యములు SHEL FISH అనే నత్త జాతికి చెందిన డిప్పలు గల ఒక రకమయిన చేప ద్వారా లభ్యమవగలవు. సముద్రములోని అడుగు భాగములో తిరుగుతూ ఇసుకరేణువులు ఈ డిప్పలలో చేరినప్పుడు వాటికి యిబ్బంది కలుగుతుంది. వాటి

నుండి రక్షణ కొరకు ఆ పరిసరాలలో ఒక రకమయిన ద్రవము స్రవిస్తాయి. ఆ ద్రవం గట్టి పడి ముత్యములుగా రూపొందుతాయి.

బృహత్సంహితలో చెప్పబడినవి ప్రకృతిలో లభ్యమయ్యే ముత్యములు 1. ఏనుగు కుంభస్థలాల లోను, 2. సర్పాల శిరస్సులపైనా, 3. ముత్యపు చిప్పలలోను, 4. శంఖములలోనూ, 5. మేఘాలలోను 6. వెదురుబొంగులలోనూ, 7. ఒక రకముగల చేపలలోను, 8. అడివి పంది కోరలలో లభించగలవనీ, మంచి ముత్యములు ముత్యపు చిప్పలలో లభించగలవని పేర్కొనటం జరిగింది.

1. ఐరావతము సంతతికి చెందిన ఏనుగుల కుంభస్థలములలో క్రింద, వాటి దంతాలు పుట్టే స్థలములో ఏర్పడే ముత్యములు పుష్యమినాడు గానీ, శ్రవణం నక్షత్రంరోజున గానీ, ఆది, సోమవారాలలో గానీ యివి లభించగలవు. భద్ర జాతికి చెందిన ఏనుగులలో లభించు ముత్యములు ఉత్తరాయణ కాలములో ఏర్పడు సూర్య (లేక) చంద్ర గ్రహణ సమయాల్లో లభించగలవట. ఇవి అధికమయిన కాంతి వంతముగను అనేక రూపాలలో వుంటాయి. ఇవి ధరించిన వారికి సర్వ విధములా విజయము లభించగలదు. దీనిని 'గజముక్తా' అంటారు. అమెరికా దేశములోని ధనవంతుని వద్ద 20 గ్రాముల బరువు గల గజముక్తా ఉందట. దీని విలువ 100 కోట్లకి పైబడి వుంటుంది. మనదేశములో కూడా ఈ మాదిరి ముత్యాలు కలవనీ, అవి వున్నచోట ఆ గదిలో దీపం అవసరం వుండదని అంటారు.

2. అడవి పందుల కోరలు పుట్టే ప్రాంతములో లభించగల ముత్యములు చంద్రకాంతి వలె మెరవగలవని చెప్పబడింది. వీటిని 'శూకరముక్తా' అని అంటారు. ఇవి క్యారెట్ నుంచి 5 క్యారెట్ బరువు గలవి సుమారుగా 4 లక్షలు పైగా వుంటుందనీ, ఇది వాక్ శుద్ధిని కలగజేయగలదని అంటారు.

3. చేపలు, తిమింగలాల పొట్టలో దొరికే ముత్యములు స్వచ్ఛముగను, చేప కన్ను ఆకారములో వుండి, 5 క్యారెట్లు నుండి 10 క్యారెట్‌లు వుంటాయట. ఇది ధరించిన వారికి చీకటిలో సైతము చూసే శక్తి కలగగలదట.

4. మన భూ వాతావరణములో గాలి వివిధ పొరలలో వుంటుంది. పైకి గాలి వెళ్ళే కొలదీ పలచగా వుంటుంది. పొరలలో ఏడవ పొరలలో మేఘాల్లో ఈ ముత్యాలు ఏర్పడగలవు. పుష్యమి నక్షత్రం లో గానీ, శ్రవణం నక్షత్రంలోగానీ కురిసే వర్షంలో వడగళ్ల రూపంలో వస్తాయని చెప్పబడింది.

ఇవి కాంతి వంతముగా, మెరుపు కాంతిలో మెరుస్తుంటాయని చెప్పబడింది. ఇది 3 క్యారెట్ల బరువు కలిగి వుంటాయి. దానిని 'మేఘ-ముక్తా' అంటారు.

5. తక్షకుడు, వాసుకి జాతికి చెందిన సర్పాల శిరస్సులలో (ఆ సర్పములు 100 సంవత్సరములు బతికినవి) ఉంటాయనీ, దేవేంద్రుడు వర్షము కురిసినప్పుడు అవి మనకు కనిపిస్తాయట. దీనినే ' కామధేను' అంటారు. దీనికి సాన పెట్టకుండా ఉంగరంలో పొదగాలి.దీని విలువ అమూల్యం. 20 కోట్లకి పైనే వుంటుంది. దీనికి 'సర్ప-ముక్తా' అంటారు.

6. దట్టముగా వ్యాపించే అడవులో వెదురు పొదలలో వేణుగానం వంటి ధ్వని వస్తుంది. శ్రవణం, స్వాతి, పుష్యమి నక్షత్ర కాలంలో జరుగుతుంది. ఆ నక్షత్రాలలోనే ఆ ధ్వని వస్తుంది. వెదురు కణుపుల వద్ద ఈ ముత్యం ఉంటుంది. దీనిని 'వంశి-ముక్తా' అంటారు.

7. శంఖములలో ప్రత్యేకంగా పాంచజన్యమనెడి శంఖములో దొరికేది నీలం రంగు గల ముత్యం లభించ గలదు. ఈ ముత్యము మెరుపు వుండదు. దీనిని ధనవంతులు ఎక్కువగా ధరిస్తారు. లక్ష్మీదేవి ఈ ముత్యము నుండీ ఆవిర్భవించిందనీ, దీనిని 'శంఖముక్తా' అంటారు.

ఇవి లభ్యమవటం చాలా కష్టసాధ్యమే. వీటిని గుర్తించటం చాలా శ్రమ. సముద్రము నుండి లభ్యము కాగల ముత్యములు (ముత్యపు చిప్పలు) శ్రేష్టమయినవి. ప్రస్తుత కాలంలో కృత్రిమంగా తయారు చేస్తున్నారు.

## సముద్రంలో ముత్యపు చిప్పలలో లభించే ముత్యములు :-

| | | |
|---|---|---|
| శృంగణము | - | ఈ ముత్యములు ఎరుపు రంగులో వుంటాయి. ఇవి ఎక్కువ విలువ కలిగి ఉంటాయి. |
| రావణము | - | ఈ ముత్యములు ముత్యపు చిప్పలలో బంగారు (Golden) రంగులో లభిస్తాయి. |
| తామ్రపర్ణి | - | ఈ ముత్యములు తామ్రపర్ణి ప్రదేశంలో బంగారు, రాగి కలిసిన మిశ్రమ వర్ణములో వుంటాయి. |

## స్వాతి ముత్యములు :-

స్వాతి కార్తెలో సూర్యుడు స్వాతి నక్షత్రములో సంచరించు సమయంలో ముడుచుకుని ఉన్న ముత్యపు చిప్పలు తెరుచుకుని ఉన్నప్పుడు ఆ సమయంలో పడిన వర్షం చిప్పలలో పడిన తర్వాతనే ముడుచుకుంటాయి. అవి లోపల ఘనీభవించి ముత్యములుగా ఏర్పడతాయి, వాటినే స్వాతి ముత్యములంటారు. ఈ పడినప్పుడు ఏర్పడిన అదురుకు రెండుగా విడిపోతే రెండు ముత్యములు ఏర్పడగలవు. బాగా చెదిరినప్పుడు అనేక ముత్యములుగా ఏర్పడే అవకాశముంది.

ఈ ముత్యములు 3 రకములు. అవి

| | | |
|---|---|---|
| సంతారము | - | మలినం కాకుండా ఏ దోషాలు లేకుండా నక్షత్రం లేకుండా ప్రకాశించగలవు. |
| ఆణి | - | గుండ్రముగను మేలిమికాంతితో ప్రకాశించగలవు. |
| సుపాణి | - | తెల్లగను, నిర్మలమయిన కాంతితో ప్రకాశించగలవు. |

## ముత్యములో గల దోషములు :-

| | | |
|---|---|---|
| దృశ్యము | - | మూడు మూలలుగ త్రికోణాకారం. |
| పార్శ్వకము | - | గుంటలు కలిగినది. |
| త్రివృత్తము | - | మూడు పొరలుగా వున్నది. |

| | | |
|---|---|---|
| కాకపాణి | - | నల్లరంగులో వుండేది. |
| వికట పీఠము | - | చిన్న చిన్న బుడిపెలు వుండేది. |
| విద్రుమము | - | ఎర్రగా వుండేది. |
| జఠరము | - | కాంతి హీనముగను, మూసినట్లు వుండేది. |
| ధూమ్రాంకము | - | పొగ వంటి మబ్బు రూపం |
| మత్స్యాక్షి | - | చేప కన్ను వలె వుండేది. |
| శుక్తికా స్పర్శము | - | ముత్యములకి ఇసుక రేణువులకి అంటుకుని వుండటం |

ముత్యములలో అనేక జాతులున్నాయి. ఇవి అనేక వర్ణాలలో లభిస్తున్నాయి. ఇవి పర్షియన్ జలసంధి, మన్నార్ జలసంధి, ఎర్ర సముద్ర ప్రాంతాలలో లభిస్తాయి. ఆస్ట్రేలియా దేశములో కృత్రిమంగా తయారు చేస్తున్నారు. మంచి నీటి, ఉప్పు నీటి ముత్యములు జపాన్, చైనా దేశాలలో లభిస్తున్నాయి. అంతే గాక స్కాట్ లాండ్, ఐర్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, మిసిసిపి ప్రాంతాల్లో లభిస్తున్నాయి. భారత దేశంలో బొంబాయి ప్రాంతంలో , దక్షిణాదిన తమిళనాడులో తిరునల్వేలి జిల్లాలో తుత్తుకుడి ప్రఖ్యాతి గాంచినది. కొన్ని వేల సంవత్సరాలుగా బొంబాయి ముత్యాలు ప్రసిద్ధి గాంచినవే గాక అవి ఆభరణాలలోనే గాక ఔషధాలలో కూడ ఉపయోగిస్తున్నారు.

## ముత్యముల పరీక్ష :-

గోమూత్రంలో కొంచెము ఉప్పు కలిపి దానిలో ముత్యములు నానపెట్టి ధాన్యపు ఊకలో రుద్దినపుడు ఆ ముత్యము పగలక యధాప్రకారముగా వుంటేనూ, పూర్వము కంటే ప్రకాశవంతముగా వున్నను అది సరియగు జాతి ముత్యముగ గుర్తించాలి. అవి పగిలినచో కృత్రిమ ముత్యమని గమనించాలి.

## ముత్యముల గురించి...

జాతి ముత్యము లోపల రంధ్రముని భూతద్దంలో చూసినప్పుడు ఉల్లిపాయలోని పొరలు వలే నరుకులు నరుకులు కనిపించును. కృత్రిమపు ముత్యములో బెజ్జము సాపుగ యున్నట్లు కనిపించును. కృత్రిమ ముత్యము నీటిలో నానపెట్టిన పొరలు పొరలుగా వూడి పోవుచుండును.

మన దేశములో ముత్యములు లబించు ప్రదేశములు ప్రభుత్వము వారి అధీనములో వున్నవి. సాధారణముగ మార్చి, ఏప్రిల్, మాసములలో ముత్యములు లభించు ప్రదేశములలో ఈతగాండ్రచే తీయించుచుందురు. నేర్పరులయిన జాలరులు సముద్రములో ముత్యములు దొరకు ప్రదేశములందు పడవలలో పోయి ముత్యములు తెచ్చుకుంటారు. ఈ విధముగా తీయబడన ముత్యములు జాతి ముత్యములు. ఇవి ధరించుటకు ప్రశస్తమయినవి. జపాను దేశములో మరి కొన్ని ఇతర దేశములలో కూడ ముత్యములు కృత్రిమంగా తయారు చేయుచున్నారు. ఆ విధమయిన ముత్యములు ధరించుట అలంకరణ కొరకే గానీ కొంచెము కూడ ప్రయోజనముండదు.

అంతే గాక పగడము రంగులో యుండు మూడు కోణములు గల ముత్యములు ధరించుట ప్రశస్తములైనవి కావని విజ్ఞుల అభిప్రాయము.

**ముత్యము ధరించుట వలన కలిగే లాభములు :-**

ముత్యమునకు అధిపతి చంద్రుడు. చంద్రుడు వ్యాపారమునకు కారకుడు. అందువల్ల వ్యాపారము చేయువారు ముత్యము ధరించినచో వ్యాపారములో సుఖ సంతోషములు, అధిక లాభములు పొందగలరు. వ్యాపారము ఒడిదుడుకులు లేక సక్రమముగా సాగి పోవును. వ్యాపార మూలంగా పరిచయములు పెరిగి సంఘంలో పేరు ప్రతిష్ఠలు గడింతురు. ముత్యము ధరించిన వారికి ఎల్లప్పుడు అన్ని విధాల అనుకూలించుటయే గాక సకల సంపదలు కలుగును.

మనశ్శాంతి లేని వారు ముత్యము ధరించిన వారికి మనశ్శాంతి కలుగును. ముత్యము ధరించిన వారికి ఆలోచనా శక్తి పెరగ గలదు. నేత్ర దోషములను, అంగ దోషములు పోగొట్టును. సంభోగశక్తిని వృద్ధి చేయును.క్షయ, ఉబ్బసము, స్ఫోటకము, చర్మవ్యాధులు, వీర్య స్కలనము, శుక్లనష్టము, గుండె నొప్పి లాంటి గుండెకి సంబంధించిన వ్యాధులు, కీళ్ళ వాతము, స్త్రీలకి కలిగే బహిష్టు దోషములు, బొల్లి వ్యాధి, జ్ఞాపక శక్తి లేకపోవటం, అజీర్ణము, ఉదర సంబంధ వ్యాధులకు వీలయినంత మేర తగ్గుటకు అవకాశము కలదు.

దాంపత్య జీవితములో అన్యోన్యతకు, సౌఖ్యమును,కలగజేయును. వివాహము జరుగుట ఆలస్యమయిన వారు జాతి ముత్యము ధరించిన త్వరలో వివాహమగును. మేహశాంతి, పైత్య రోగములను ఉపశమింపజేయును. దీనిని శాస్త్రము ప్రకారము భస్మము తయారు చేసి ధనవంతులు తమలపాకులకు సున్నము బదులుగా వాడుటకు ఉపయోగింతురు. స్త్రీల పాలిట కల్పతరువు. స్త్రీలు ముత్యాల హారములను అందముగా కంఠమున ఉపయోగింతురు. చంద్రుడు మాతృ కారకుడు. తల్లిచే కలహములు, అభిప్రాయ భేదములు కలిగినపుడు ముత్యము ధరించిన ఆ కలహములు సమసి పోగలవు. జాతకరీత్యా చంద్ర మహాదశ జరిగేటప్పుడు ముత్యమును ధరించిన జీవితములో కష్టనష్టములు తొలగి, మంచి అభివృద్ధి పథంలో వుండగలరు. వ్రణములు నివారించుటలో ముత్యము ఆయుర్వేదంలో ఔషధముగా పని చేయగలదు. ముత్య భస్మము సేవించిన మేహశాంతిని నశింపజేయగలదు. శరీరములో గల వేడిని తగ్గించ గలదు.

ప్రస్తుత కాలములో మేఘముల ద్వారా వచ్చునవి, పాము తలపై వుండునవి, వెదురు బొంగులపై, చెరుకు గడలపై, ఏనుగు కుంభ స్థలముపై, పంది కోరలలో లభ్యమగు ముత్యములు దొరుకుట కష్ట సాధ్యము. సముద్రములో దొరకు ముత్యములే ప్రశస్తసమయినవనుటలో సందేహము ఎంతమాత్రము లేదు. ఎరుపు పొడలు గల, ముత్యమును ఎట్టి పరిస్థితులలో ధరించరాదు. తెలుపుగా, స్వచ్ఛముగా, గుండ్రముగా వున్న ముత్యములను మాత్రమే ధరించిన కుటుంబము సుఖ సంతోషములతో వర్ధిల్లగలదు.

# 3. పగడము (CORAL)

HARDNESS - 3.00

POLYP అనే సముద్రపు జంతువు యొక్క ఎరుపు వర్ణము గల అస్థి పంజరము. దీనిని ప్రవాళ స్ఫటికము, పగడపు చలవ రాయి అని అంటారు. జీవ శాస్త్రములో దాని పేరు CORALIGENEOUS LEOPYHYTES. పగడమునకు అధిపతి కుజుడు. పగడము కుజునికి ప్రీతి పాత్రమయినది.

**పగడము పుట్టుక :-**

పగడములు సముద్రములో గల ఒక పురుగు వలన పుట్టును. ఆ పురుగు యొక్క పురీషము గట్టిపడి పగడము తయారగుచున్నది ఈ పురుగులు చిన్నవిగా వుంటాయి. చిన్నది అంగుళము పొడవు కల్గి, పెద్దవి రెండంగుళముల పొడవు కలిగి వుంటాయి. ఇవి సముద్ర తీరములకు దగ్గరగా సంచరించి రాళ్ళను అంటి పెట్టుకుని వుంటాయి. రెండంగుళముల పొడవు గల పురుగు సముద్రములో విచ్చల విడిగా తిరుగు చుండును. కొన్ని పురుగులు మాత్రము సముద్ర తీరమునకు దగ్గరగా యుండు యిసుక దిబ్బలపై వుండును. ఈ పురుగులు కొన్నిటి శరీరములపై చిన్న కాయలు వుండి పగడము ఏర్పడుటకు ఒక రకమయిన జిగురు వంటి పదార్ధము వూట వలె వచ్చును. ఎక్కువగా ఈ పురుగులు గుంపులు గుంపులుగా వుంటాయి. ఈ పురుగులపై వుండే పగడములు చూచుటకు మనోహరముగాను, నునుపుగాను వుండును. ఈ పురుగులు సముద్ర మధ్యములో వుండే దీవులలో విస్తారముగా వుంటాయి. అట్టి ప్రదేశములలో ఎక్కువగా పగడములు దొరుకుచుండును. సముద్రపు పోటుకు సమయంలో సముద్రము వొడ్డుకు చేరుచుండును. పగడములు సముద్రములో 20 అడుగుల నుండి 1000 అడుగుల లోతులో లభ్యమయ్యే అవకాశముంది. ఈ పురుగుల గుంపులు కనీసం 2, 3 మైళ్ళ దూరం వరకు వ్యాపించి వుండే అవకాశముంది. ఎక్కువగా లభ్యమయ్యే ప్రాంతాలనే పగడపు దీవులని పేర్కొంటారు. వీటికి శత్రువుల నుండి రక్షించుకొనుటకు తీగ వంటి నరము కలదు. దీన్ని సముద్రపు గుర్రం తాకిన విపరీతమయిన బలం వచ్చే అవకాశముంది.

పగడములు నాలుగు రకములు. అవి 1. బ్రాహ్మణ 2. క్షత్రియ 3. వైశ్య 4. శూద్ర

కుందేలు రక్తము వలె ఎరుపు కలిగి వుండి పై భాగము నునుపుగా వుండేది బ్రాహ్మణ జాతి, చూసేటందుకు ఆహ్లాదకరంగా వుండి తేలికగా సింధూరమునకు సమానము గల రంగును కలిగి యుండి మంకెను పువ్వు వలె వుండునది క్షత్రియ జాతిది. అంతే కాక దాసాని పువ్వు వలె ముదురు ఎరుపు రంగు కలిగి గట్టిగా నునుపుగాను, వుండునది క్షత్రియ జాతి. ఇది తొల వేయటం కష్టసాధ్యము. మోదుగ, పొదిరి పుష్పముల వలె రంగు కలది వైశ్య జాతి. మలినముగా ప్రకాశవంతముగా నుండక కళాహీనముగా నుండునది శూద్రజాతి.. పగడములు లంక దేశమునందు,

సముద్ర తరంగములలో లభ్యమగును. కొన్ని కొన్ని దీవులందు విస్తారముగా లభించగలవు. ఆ దీవులని పగడపు దీవులని పిలుస్తారు.

ఈ పగడములోను నాల్గు విధములు దోషములు కలవు. అవి పగడములో మలినము, జర్ఘరము, బొప్పి, కోమలము.

1. పగడములో బుడిపెలు కలిగి వున్నచో జఠర దోషము కలిగినటువంటిది. దీనిని ధరించిన ప్రాణాపాయం సంభవించే అవకాశముంద. అంతే గాక కుటుంబంలో అశాంతి, మనస్పర్ధలు, కలహములు కలిగే అవకాశముంది. ధరించిన తర్వాత జాతకుని దశ తిరిగి దరిద్రము తాండవించే అవకాశములు ఎక్కువ.

2. మధ్యలో (గోమయము) ఆవు పేడ వంటి మరకలున్న 'కోమలము' దోషము. దీనిని ధరించిన ఏ పనియందు ఆసక్తి లేకపోవటం, అనవసర ప్రసంగాల వలన తలవని తలంపుగా అకస్మాత్తుగా కలహములు సంభవించే అవకాశముంది. ఏ పని ప్రారంభించినా పని సాగక అశాంతి కలుగుచుండును. ఎచ్చటికైనా పోయి ఏ మిత్రుని సహాయమర్ధించినా ఆప్తమిత్రులే శత్రువులుగా మారుదురు. అన్ని విధాల అపజయము వెన్నంటి వుంటుంది.

3. మురికి తేరినట్లుగా " మలిన" దోషముంటుంది. దీనిని ధరించిన వారికి అనేక విధముల కష్టములు సంప్రాప్తించ గలవు. అనుకున్న పనులు జరగక అనేక యిబ్బందుల పాలయ్యే అవకాశముంది.

4. బొప్పి గల పగడము సమానముగా వుండదు. దీనిని ధరించిన ఆకస్మికముగా ప్రమాదములు, అనారోగ్యము సంప్రాప్తించ గలదు. అనేక రోగములు కలిగే అవకాశముంది.

అన్ని విషయములు పరిశీలించిన తర్వాతనే పగడము ధరించాలి.

## పగడము ధరించుట వలన కలిగే లాభములు :-

పగడమునకు అనేక పేర్లు కలవు. అవి ప్రవాళము, విద్రుమము, అంగారక మణి, కుజప్రియ, రక్తాంగము, ఆబ్ధి పల్లవ, రక్తముక్తి, లతామణి, హిందీలో 'మూంగా' అని పేరు.

ప్రశస్తమయిన పగడములు ఆల్జీరియా, టునీసియా, స్పెయిన్, ఫ్రాన్స్, ఇటలీ, జపాన్ దేశములందు లభ్యమగుచున్నవి.

వీటిని ధరించిన ధైర్య సాహసములు, నూతనోత్సాహము కలుగును. పోలీసు శాఖలోనూ, మిలటరీలో పని చేయు వారు ధరించిన ఉద్యోగములో తలవని తలంపుగా ఉన్నత పదవులు అలంకరించ గలరు. పిల్లలకు తాయెత్తులు కట్టిన వీరికి దుష్టశక్తుల నుండి రక్షణ కలుగుతుంది. అందువల్ల పిల్లలకు బహుమతిగా ఈ పగడము ఇతర దేశాలలో ఇస్తారు. దీనిని ధరించిన వారికి గుండెకి సంబంధించిన వ్యాధులు రావు. మానసిక ఆనందము కలుగును. కుటుంబంలో ఐకమత్యం, సంపద ఈ పగడము ధరించిన కలుగుతుంది. పగడ భస్మము సేవించిన అజీర్ణ వ్యాధులు

రావు. భూ గృహ సంబంధ చిక్కులున్న తొలగ గలవు. కుజ దోషం గల వారు వివాహము జరుగుటకు ఆలస్యమయిన పెళ్ళి కాక యిబ్బందులు కలుగుచున్న ఈ పగడము ధరించిన అతి శీఘ్ర కాలములో వివాహము జరుగుతుంది.

జాతకములో కుజుడు 6, 8, 12 స్థానములలో గానీ నీచ స్థానములైన కర్కాటక రాశి యందుగానీ వున్ననూ కుజ దశ వచ్చి జాతకుడు అనేక కష్టనష్టములు కలుగుచున్న, జీవితములో అనేక కష్టనష్టములు ఎదురవుతున్న పగడము ధరించిన శాంతి, సుఖము వచ్చే అవకాశము వుంది. పగడము ధరించిన చెవిటి బాధ తగ్గగలదు. పూర్వం రాజులు యుద్ధమునకు పోవునప్పుడు పగడము ధరించెడి వారు. పగడము ధరించిన సహోదరులలో ఐక్యత పెరుగుతుంది. పగడము భస్మము చేసి సేవించిన అతి మూత్రము, మూలశంక, కుష్టువ్యాధుల నుండి ఉపశమనము పొందగలరు. ఎంతకీ తగ్గని రోగములు పచ్చ కామెర్లు, నేత్ర దోషములకు పగడము ధరించిన మంచిదని పండితుల అభిప్రాయము. శరీరమును వృద్ధి పరుచుటయే కాక సంభోగశక్తిని ఎక్కువ చేయ గలదు. సవాయి లాంటి వ్యాధులు గల వారు ధరించిన ఉపశమనము కలుగును.

**పగడమునకు సరిపోవు డిజైన్లు :-**

BREAD, CABOCHON.

ఈ పగడము కృత్రిమంగా PORCELAIN, STAINED BONE, GLASS. PLASTIC మిశ్రమంగా గానీ RUBBER & GYPSUM MIXING లతోనూ తయారు చేయుచున్నారు.

## 4. పచ్చ (మరకతము) EMERALD

HARD NESS - 7.5 గ్రావిటీ - 2.65

పచ్చ బుధునికి ప్రతీకగా పేర్కొంటారు. ఇది ఆకు పచ్చని కాంతితో మెరుస్తుంది. పెగ్మెటైట్ పొరలయందు, వేరు వేరుగా వున్న ఖనిజాల పొరలయందు, ప్రవాహములందు కొట్టుకుని వచ్చే గులక రాళ్ళయందును లభింప గలదు.

ఈ పచ్చలు ప్రస్తుతము విరివిగా లభించుట లేదు. దోషము లేని పచ్చలు దొరుకుట కష్టమే. అంటే గీతల గానీ, బీటలు గల దోషములకు అవి కనిపించకుండా వుండుటకు అనేక రకములయిన తైలములను నింపి మోసము చేయుచున్నారు. వీటిని కట్ చేసినప్పుడు వీలయినంత మేర తరుగు తక్కువ పోయేలా STEP-CUT అను డిజైన్ ద్వారా తయారు చేయుచున్నారు. దీనికి 'ఎమరాల్డ్ కట్' అంటారు. ప్రపంచంలో చారిత్రాత్మక ప్రాధాన్యత సంతరించుకున్న పచ్చలు క్లియోపాత్రా గనుల నుండి (అంటే ఈజిప్ట్ దేశపు గనులలో) లభ్యమయినవే.

రత్నశాస్త్ర గ్రంథమునందు పచ్చల గురించి చెప్పిన విషయములలో ముఖ్యమయిన విషయమేమిటంటే పచ్చలను మరకతమని కూడా అంటారు. అవి

నెమలి కంఠము రంగులో, నాచు వలె, గరిక వలె, మిణుగురు పురుగులా మెరుస్తాయని. అంతేగాక చిలక రెక్కల వలె, దిరిశెన పువ్వు వలె వివిధ రకములయిన పచ్చలలో లభ్యమవగలవు.

పచ్చని ఎండలో సూర్యునికెదురుగా పెట్టిన మంచి ఆకుపచ్చని కాంతితో మెరుస్తుంది. బంగారము, తెల్లని వస్త్రము, కుండలపై పెట్టినపుడు పచ్చని కాంతిని ప్రసరింప చేయగలదు. బాగా ఆకు పచ్చగా ప్రకాశింపజేయునది కనుక గరుడ పచ్చ అని కూడా పేర్కొనటం జరిగింది. ఇది బరువుగా, నునుపుగా వుంటుంది. దీనికి అధిక వేడి తగిలిన బరువులో 99 శాతము తగ్గుతుంది. రాపిడి వల్ల విద్యుచ్ఛక్తి వస్తుంది. పచ్చల పుట్టుక గురించి మన దేశములో గరుడ పురాణములో ఒక కథ వుంది.

సర్పరాజు వాసుకి అనే సర్పము, బకాసురుడనే రాక్షసుని చేదు కట్టని సంగ్రహించి ఆకాశములో ఎగిరిపోవుచుండగా, వాసుకిని చూసిన గరుత్మంతుడు అజన్మ శత్రుత్వము వల్ల ఆకాశములో ఎగురుచున్న ఆ సర్పరాజుని ఢీకొని యుద్ధము చేసెను. ఆ భీకర పోరాటంలో అతి బల సంపన్నుడయిన గరుత్మంతుని ధాటికి వాసుకి నిలవలేక పోయెను. మలయ పర్వత ప్రాంతములో ఆ చేదు కట్టని జార విడవగా అది దేదీప్యమానంగా పచ్చదనముతో వెలిగి పోయెను. అదిఏ మరకతము. వాసుకి జార విడుచు సమయములోనే ఆ చేదు కట్టలో కొంత భాగము గరుత్మంతుడు త్రాగెను. అట్లు త్రాగిన కొంత సేపటికే మూర్ఛ కలిగెననియు, తర్వాత లేచిన పిదప బైటకి వదిలి వేయగా అది పడిన ప్రదేశములో పుట్టిన పచ్చలను గరుడ పచ్చలని పేరు. (చేదు కట్ట అంటే పిత్త కోశము) శ్రీకృష్ణదేవ రాయలు సింహాచలములో స్వామి వారికి శ్రేష్ఠమయిన పచ్చలను ఇచ్చినట్లు తెలియుచున్నది. చక్రవర్తులు తమ ఆభరణాలలో ధరించేవారు. గరుత్మంతుని ద్వారా ఉద్భవించిన పచ్చలు అమిత శక్తి గలవి.

## పచ్చలలో గల దోషములు, పరీక్షించు పద్ధతులు :-

పచ్చ పై సున్నము పట్టించిన పచ్చని కాంతి పైకి కనబడగలదు. అదియే జాతి రత్నము. జాతి పచ్చ ఒక తులము బరువు కలిగి వుంటుంది. పచ్చపై నల్లని జీడి పూసిన, అది గాజు పచ్చ అయిన కాంతి హీనమగును. జాతి పచ్చ అయిన ప్రకాశవంతముగా మెరియును. కృతిమం పచ్చ మెత్తగా వుంటుంది.

పచ్చలలో పుప్పి, గార, కర్కశము అను మూడు రకములు గలవు. అట్టి దోషములు గల పచ్చలను ధరింపరాదు.

పచ్చలపై సూది పోట్ల వలె వున్ననూ, పుచ్చినట్లు కనిపించినా, గుండ్రముగా చారలు కలిగి వున్నను అది పుప్పి దోషము.

పచ్చలపైన రంగు వేసినట్లుండి కాంతిని కనిపించనీయకుండా చేయుగల్గునది గార దోషము. పచ్చలపై దోషము భాగము గరకుగా, సున్నపు గచ్చులా వుంటే కర్కశ దోషము.

పచ్చలకు ఎక్కడైనా కొంచెముగానైనా చెత్త లేకుండా ఉండదని శాస్త్రము. అత్తలేని కోడలు. చెత్తలేని పచ్చ ఉండదని లోకోక్తి.

రత్నములను పరీక్షించునప్పుడు అగ్నిలో కాల్చుట. ఆకురాయితో అరగదీయుట, సానపై అరగదీయుట లాంటివి చేస్తారు. ఆ విధముగా పరీక్షించిన ప్రకాశవంతమయిన కాంతి, నునుపు చెడిపోయే అవకాశముంది. పచ్చలను పరీక్షించుటకు భూతద్దములున్నవి. భూతద్దములో చూసిన తెల్లగా కనిపించ గలదు. అదే గాజు పచ్చ అయిన సహజ రంగులలో కనిపించ గలదు. అందుచేత భూతద్దములో పరీక్షించుట శ్రేయస్కరము. గరుడ పచ్చ మాత్రము గరుత్మంతునిచే జనియించునందు వలన విషమును హరింపజేయు శక్తి గలది. రాతిపై అరగదీసిన అరుగుటయే కాక, కృత్రిమ రత్నములపై జీడి పూసిన కాంతి హీనమగును.

పచ్చలకు గల పేర్లు, సాచి, గరుత్మత, గరుడాకిత, గరుతారి, సాపల్లి, బుధరత్న, పన్నా. పాచూరత్నం, పానా, పీలూ, పాచి, మరకతం, తృణగ్రాహి, హరిన్మణి పచ్చలను PENDELOQUE, STEP, ROUND - STEP, CABOCHON డిజైన్లుగా చెక్కించ వచ్చు.

## పచ్చ ధరించుట వలన లాభములు :-

పచ్చకి అధిపతి బుధుడు. జ్ఞాపక శక్తిని కలుగుటకు పచ్చ ధరించాలి. దీనిని ధరించిన మేధాశక్తి, బుద్ధి చతురత కలుగును. నరమలకు బలము కలుగును. ఉన్మాదము, పిచ్చి దోషములను నశింప జేయును. పచ్చను భస్మము చేసి సేవించిన నరములకు శక్తి కలుగును. స్త్రీల వ్యాధుల్ని నశింప జేయ గలదు.

జాతకములో బుధుడు జన్మ లగ్నములకు 6, 8, 12 స్థానములో వున్నా , నీచ యందు వున్న బుధ మహాదశలో వివిధ రకములయిన కష్టనష్టములు కలుగుచున్న బుధునికి ప్రీతి పాత్రమయిన పచ్చని ధరించిన ఆ కష్టనష్టములు తొలగి సుఖముగా వుంటుంది. ధనాదాయము వృద్ధి అగును. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములలో జన్మించిన వారు దీనిని ధరించుట వలన అదృష్ట వంతులుగా వుందురు.

స్ఫోటకము, మశూచి లాంటి వ్యాధులు గల వారు ధరించిన తగ్గును. పచ్చ కామెర్లను నశింప జేయగలదు. స్త్రీలు ప్రసవ సమయమున ధరించిన సుఖ ప్రసవము కలగ గలదు. వేదాంతులు పండిత శ్రేష్ఠులు దీనిని పవిత్ర రత్నంగా భావింతురు. దీనిని ధరించిన భగవంతునిపై చిత్తము స్థిరముగా నిలుచునని, వేదాంత జ్ఞానము అభివృద్ధి కలుగునని, ఈ రత్నము మోక్షదాయకమనీ భారతీయుల ప్రగాఢ విశ్వాసం. రావణాసురుడు పెద్ద పచ్చపై కూర్చొని స్థిర చిత్తముతో కూర్చుని భగవంతుని ప్రార్థించేవాడట.

రక్తపోటు, వ్రణములు, తల నొప్పి, కడుపునొప్పి, రాత్రులు సరిగా నిద్ర పట్టక పోవటం, దుష్ట స్వప్నము మొదలయినవి తగ్గించ గలదు. భక్తి జ్ఞానములను

కలుగజేయును. మంత్ర తంత్రముల లాంటి వాటినుండి రక్షణ కలగజేయును. విద్యార్థులు విజయమునకు, వ్యాపారస్తులు తమ తమ వ్యాపారములు సక్రమముగా సాగి ధన లాభము కలుగుటకు, వ్యాపారాభివృద్ధికి దోహదము చేయగలదు. బుధుడు శాస్త్రములకు, ముఖ్యముగ గణిత శాస్త్రమునకు కారకుడుగా పండితులు చెప్పుచున్నారు. ఈ రత్నము ధరించిన శాస్త్రములోను, గణిత శాస్త్రములోను, ప్రావీణ్యము సంపాదించ గలరు. సకల శాస్త్ర కోవిదులు, మహా కవులు, వ్యాపారస్తులు ఎక్కువగా ధరింతురు. అంతే కాక ముఖ్యముగ బుధ మహాదశ, అంతర్దశలు జరుగుతున్నప్పుడు పచ్చ ధరించిన లాభములు శుభములు కలుగును.

పచ్చలు ఎక్కువగా దక్షిణ ఆఫ్రికా, రష్యా , ఇండియా, ఈజిప్ట్ దేశములలో లభ్యమగును. ఆఫ్రికాలోని కొలంబియాలో లభ్యము కాగల పచ్చలు మంచివి, విలువ గలవి మన భారత దేశములో లభ్యమయ్యే వాటిలో ఉదయపూర్‌లోకన్నను అజ్మీర్‌లో లభ్యమయ్యే లేత రంగులు గల పచ్చలు శ్రేష్ఠమయినవి.

## 5. పుష్యరాగము (TOPAZ - YELLOW SAPHIRE)

HARD BESS - 8.00

మన ప్రకృతిలో ఎన్ని రంగులున్నవో అన్ని రంగులలో ఈ పుష్యరాగం వుంది. ఈ పుష్యరాగము గురు గ్రహానికి ప్రీతి కరము, ప్రతీకగా పేర్కొంటారు.

పుష్యరాగము అగ్ని పర్వత శిలలలో, పెగ్మటైట్ పొరలలో లభ్యమవుతుంది. ఎక్కువగా ఇప్పుడు ప్రవాహంలోనే ఎక్కువగా వస్తున్నాయి. అనేక రంగులు గల పుష్యరాగములు లభించినప్పటికీ బంగారు ఛాయతో మెరిసే కనక పుష్యరాగం SHERRY TOPAZ, లేత గులాబి రంగు పుష్యరాగాలు అతి విలువ కలవి గా పేర్కొన్నారు. అయినా లేత గులాబి రంగు గల పుష్యరాగాలు చాలా తక్కువగా లభ్యమవుతాయి. ఈ రోజుల్లో వేడి ప్రక్రియ (Heat Treatment) లో తయారయినవే లభ్యమవుతున్నాయి.

వర్ణ రహితము గల పుష్యరాగములును పరా నీల లోహిత కిరణాల ద్వారా (IRRADIATION) గురి కాబడి నీలి రంగు పుష్యరాగములుగా కూడా సృష్టించుకోవచ్చు. అక్వా మెరైన్ అనే రత్నమునకు గల భేదము గుర్తించుట కూడా కష్టమే. పుష్య రాగముపై డైమన్ ఆకారంలో అంచుల వెంట స్వాభావికంగా గీతలుంటాయి. ఖచ్చితంగా సాన పెట్టుటకు వీలు కలిగినది పుష్యరాగము. క్రీ.శ. 17 వ శతాబ్దములో పోర్చుగీసు రాజు కిరీటంలో పొదగబడిన (బుగాంజే BRAGNAZA) పుష్యరాగం యింత వరకు లభించిన వాటిలో పెద్దది. బరువు 1640 క్యారెట్లు. ముందుగా దీనిని వజ్రంగానే చాలా రోజులు భావించారు. కాల క్రమంలో పరిశోధనల మూలంగా అది రంగులేని పుష్యరాగమని చివరకు తేల్చారు. వాటికన్‌లో "16×12" అంగుళములు గల పుష్యరాగపు శిలువ వుంది.

ఈ పుష్యరాగాలు ఎక్కువగా బ్రెజిల్, అమెరికా, శ్రీలంక, బర్మా, రష్యా, ఆస్ట్రేలియా, పాకిస్థాన్, మెక్సికో, జపాన్, ఆఫ్రికా దేశాలలో లభిస్తున్నాయి. రష్యా, బ్రెజిల్, పాకిస్తాన్ లలో అరుదుగా లభించే గులాబి రంగు గల పుష్యరాగాలు లభ్యమవుతున్నాయి.

పుష్యరాగం కుగల పేర్లు. పుష్పరాజ్, గురురత్నం, గురు వల్లభ, పీత మణి, వాచస్పతి, పుష్యమి, శ్వేత మణి, జీవ మణి.

పుష్యరాగానికి BRILIANT, CUSHION, PENDELOQUE, STEP I, STEP II, Mixed డిజైన్లు బావుంటాయి.

పుష్యరాగానికి అధిపతి గురువు. ఇది ఆకాశములోని పుష్యమి నక్షత్రము వలె వుంటుంది. అందువల్ల దీనికి పుష్యరాగమని పేరు.

పుష్యరాగము శ్రేష్ఠము గల రత్నము. దీనిని ధరించిన గొప్ప యోగమును కలుగ జేయ గలదు. పుష్యరాగము తేనె రంగులో గానీ, గోగు పువ్వు రంగులో గానీ, జనప పువ్వు రంగులో గానీ వుంటుంది. తెలుపురంగులో వున్నది ఏ దోషములు లేనిది మాత్రమే బ్రాహ్మణ జాతిది. కొంచెముగా పసుపు, ఎరుపు రంగుల మిశ్రమముగా వుండునది క్షత్రియ జాతి. కొద్దిగా పసుపు, నీలము రంగులు కలిసి వుండేది వైశ్య జాతి, పసుపు రంగులో నీలము గలది, నీలము రంగుఅధికముగా గలది శూద్ర జాతి.

పుష్యరాగము నిర్మలముగా, నున్నగ, కొంచెము పెద్దదిగ, బరువు కలది, మిట్ట పల్లములు లేక సమంగా గోగు పువ్వు రంగులో వున్నది శ్రేష్ఠమయినది. గోరోచనము రంగు, నలుపురంగు, తెలుపు కలసి గరగరలు, మలినము, కర్కశము గలవి ప్రశస్తములైనవి కావు. బంగారువంటి రంగు కలిసి ధగధగ మెరిసేది కనక పుష్య రాగము. కనక పుష్యరాగము ధరించుట చాలా మంచిది. పైన గరుకుగా వుంటే పుష్యరాగము సాన పెట్టిన దోషములు నశించి నిర్మలముగా వుంటుంది. నల్ల చుక్కలు కలిగి, మిక్కిలి తెలుపు, మలినము కలిగి తేలిక, రెండు రంగుల మిశ్రమము గా గలది మంచిది కాదు. దీనిని ధరించ రాదు. మూసినట్లుగా పుష్యరాగము ధరించరాదు. ఎక్కువగా పుష్యరాగము రెండు మూడు పొరలుగా వుంటుంది. కొన్ని పుష్యరాగములలో రెండు పొరలుగా వుండి కింద కొంచెం ఎరుపుగను, పై భాగములో తెలుపుగానీ, నీలముగానీ వుంటుంది. కొన్నింటికి కింద భాగములో గోధుమ రంగు వుంటుంది. బంగారపు రంగు వుండి నిర్మలముగ ప్రకాశవంతము గల దానిని ధరింపవచ్చు. బలాసురుని చర్మము భూమిపై పడిన పుష్యరాగముగా మారెనని గరుడ పురాణములో పేర్కొనుట జరిగింది. కాని రత్నములన్నీ భూమి మీదే పుట్టినవే.

పుష్యరాగములు లభ్యమయ్యే ప్రాంతాలలో బ్రెజిల్, అమెరికా, శ్రీలంక, బర్మా, ఆస్ట్రేలియా, రష్యా, పాకిస్తాన్, మెక్సికో, జపాన్, ఆఫ్రికా దేశాలలో లభ్యమవుతున్నాయి. రష్యా, బ్రెజిల్, పాకిస్తాన్‌లలో అరుదుగా లభ్యమయ్యే గులాబి రంగు గల పుష్యరాగాలు లభిస్తున్నాయి.

## పుష్యరాగము ధరించుట వలన లాభములు :-

పుష్యరాగము ధరించిన ఋణ విముక్తి కలుగును. శత్రువులు మిత్రులుగా ఉందురు. శత్రువుల వలన ఉపకారము లభింప గలదు. కోపోద్రేకము, దురహంకారములు తగ్గును. పుత్ర సంతాన ప్రాప్తి తద్వారా వంశవృద్ధి కలుగును.

జ్యోతిష్య శాస్త్ర ప్రకారము గురువు పుత్ర కారకుడు. అంతేకాక ధన కారకుడు. విద్యాకారకుడు. దరిద్ర బాధలతో సతమతమయ్యే వారు పుష్యరాగమును ధరించిన వారికి అప్రయత్నముగా ధన లాభము కలుగుతుంది. వారు చేయు వృత్తులలో ఆదాయము పెరిగి సుఖ సంతోషములతో వుండగలరు. విద్యార్థులు పుష్యరాగము ధరించిన పరీక్షలలో విజయము సాధింప గలరు. అంతేగాక విద్యలో అత్యున్నత స్థానము అలంకరించ గలరు. విద్యలో ఆసక్తి పెరిగి శ్రద్ధగా చదివి పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులగుదురు. సంతానహీనులు పుష్యరాగము ధరించిన పూర్ణాయుర్దాయము కలిగిన పుత్ర సంతానము కలుగుతుంది. పుష్యరాగము ధరించిన వారికి దైవ భక్తి, దైవ చింతనతో మంచి కార్యములను నిర్వర్తింప గలరు. మంచి సత్ప్రవర్తన కలిగి వుందురు. త్రాగుడు, వ్యభిచారము, జూదము మొదలగు వ్యసనములు గల వారు పుష్యరాగము ధరించిన క్రమ క్రమముగా ఆ వ్యసనములపై ఆసక్తి తగ్గి ఆ వ్యసనముల నుండి బయట పడి సుఖ జీవనము చేయ గలరు. పుష్య రాగము జీర్ణ శక్తిని వృద్ధి చేయ గలదు. మేథా శక్తిని పెంచును. నరముల బలహీనతను తగ్గించ గలదు. చేతులు, కాళ్ళు శరీరము వణుకుటను పోగొట్టగలదు.

జాతకములో గురుడు జన్మ లగ్నములో 6, 8, 12 స్థానములలో వున్నను, నీచరాశియైన మకరములో వున్న , గురు మహాదశ జరుగుచున్నను, పుష్యరాగము ధరించిన ఆ దోషము పరిహారమగును. అంతే గాక శుభము, సౌఖ్యము, ధన లాభము కలుగును. గోచారము ప్రకారము గురువు చంద్రుడున్న రాశి వారికి 1, 4, 6, 8 రాశులలో సంచరించు కాలము నందు పుష్యరాగము ధరించిన ఆ దోషము నశించి కష్టసుఖములు కలగక సుఖముగ వుందురు. ఉద్యోగస్తులు ధరించిన వారికి జయప్రదముగా వుండ గలదు. ఉద్యోగములో అప్రయత్నముగా ప్రమోషన్లు వచ్చే అవకాశముంది. అంతే గాక పై అధికారుల ప్రశంసలు కూడా పొంద గలరు.

పుష్య రాగము అదృష్ట రత్నము. ఏ నక్షత్రములలో జన్మించిన వారికైనా ఏ మహాదశ జరుగుచున్న వారికైనా ఈ పుష్యరాగము రత్నము ధరించిన కష్టనష్టములు, దరిద్రము తొలగి పోగలవు.

1, 10, 28 తేదీలలో జన్మించిన వారికి అదృష్ట సంఖ్య '1'. వీరు పుష్యరాగము ధరించిన అదృష్టము కలుగుతుంది. దీనిని వీరికి BIRTH STONE (అదృష్ట రత్నముగా) జ్యోతిష్య శాస్త్రములో చెప్పబడింది. ఎవరు ఏ ఏ రత్నములు ధరించవలెనన్న జ్యోతిష్కులు ఒక్కో రకంగా చెప్పడం మనం గమనించగలం. ఎవరైనను పుష్యరాగము ధరింపవచ్చు. అదృష్ట రత్నమే కాక అదృష్టమును

కలగజేయునది, రోగ నివారణలో కూడా రత్నములు అద్భుతముగా పని చేయగలవు. ఈ పుష్యరాగము ఉదర సంబంధ వ్యాధులను నివారించును. నవ గ్రహములలో అత్యంత శుభుడు, యోగ కారకుడైన, దేవ గురువైన బృహస్పతి యొక్క ఆధిపత్యము కలిగినటువంటి రత్నము.

దోష రహితము గల కనక పుష్యరాగము ధరించిన ధనము, ఆయుష్షు, పేరు, ప్రతిష్ఠలు, గౌరవము లభింప గలవు. దుష్టశక్తుల నుండి రక్షణ లభింప గలదు. స్త్రీ జాతకములో భర్త కారకుడై బృహస్పతి వివాహము ఆలస్యము కల్పించినప్పుడు కనక పుష్యరాగము ధరించుట వలన వివాహము త్వరగా జరిగి సుఖ సంతోషములు పొందగలరు.

# 6. వజ్రము (DIAMOND)

HARD NESS - 10.0

భూమిపై లభ్యము కాగల పదార్థములలో అత్యంత గట్టి పదార్థము వజ్రము. భూ గర్భంలో 80 కి.మీ. లోతున అత్యధిక ఉష్ణోగ్రత పీడనంలో కర్బన అణువులు ఒకదానితో ఒకటి అతుక్కొని వజ్రాలుగా రూపొందుతాయి. ఈ వజ్రము సౌందర్యాధి దేవత రాక్షస గురువు శుక్రునికి ప్రతీక గా భావించడం జరిగింది.

'బృహత్సంహిత'లో చెప్పిన ప్రకారముగ ఆనాటి వివరాల ప్రకారం వీణా నదీతీర ప్రాంతాలలో లభించేవి స్వచ్ఛమయినవి. కోశల దేశములో లభ్యమయ్యేవి శిరీష పుష్పము వలె (తెలుపు కలిసిన పసుపు రంగులో వుండే పువ్వు) మెరుపు కలిగి వుంటాయని, పౌర్పర రాజ్య ప్రాంతములో లభ్యమగునవి ముదురు రంగులు విరజిమ్మగలవనీ, సౌరాష్ట్ర ప్రాంతములో ఎరుపు కలిగి మెరుస్తాయనీ, హిమాలయ పర్వత ప్రాంతములో లభ్యమగునవి గులాబి రంగులోనూ, మాతంగ దేశములో వల్ల (GREY) పుష్పాల వలె మెరుపు కలిగి వుంటాయని,పౌండ్ర దేశంలో లభ్యమగునవి నలుపు (నీలం) రంగులో వుంటాయనీ తెలియ జేయబడింది.

షడ్భుజములు కల్గి తెల్లని రంగులో వుండేది ఇంద్రునిచే సృష్టించబడింది. పాము నోటి వలె ముదురు రంగులో వుండునది యముని చేతను, అరటి చెట్టు రంగులో ఏ ఆకారము కల్గినదైనా, శ్రీ మహావిష్ణువు చేతనూ, కర్ణికార పుష్ప రంగులో స్త్రీ జననాంగము వలె వరుణుని చేతనూ, పులి కన్ను వలె త్రిభుజాకారములో వుండేది అగ్ని చేతనూ, యవ గింజల వలె అశోక పుష్పంలా వుండేది వాయువుచే సృష్టించబడినవట.

**వజ్రములలో గల రకములు 4 :-**

| జాతి | లక్షణము | ఫలితము |
|---|---|---|
| 1. బ్రాహ్మణ | మల్లెపూవు వలె తెల్లని వజ్రములు | భోగములు, సంపద. |

| | | |
|---|---|---|
| 2. క్షత్రియ | చెట్ల చిగుళ్ళ వలె ఎరుపు, పసుపు రంగులు | సకల జన వశీకరణం. |
| 3. వైశ్య | బంగారు రంగువలె , శిరీష పుష్పాల వలె పచ్చగా | ఐశ్వర్య ప్రదం. |
| 4. శూద్ర | కొంచెము నీలము, ముదురు రంగులలో | కష్టనష్టములు. |

## వజ్రములలో లింగములు :-

| | | |
|---|---|---|
| పురుష వజ్రములు | - | ఆరు కోణములు (ఆరు అంచులు, ఇంద్రధనస్సు) రంగులు కలిగి వుండేవి. |
| స్త్రీ వజ్రములు | - | గుండ్రముగా రేఖ బిందువులు లేకుండా వుండేవి. |
| నపుంసక వజ్రములు | - | మూడుకోణాలలో మధ్య భాగం ఎత్తుగా వుండి గుండ్రముగా వున్నది. (అటుకుల రంగులో లభ్యమగునది) |

నపుంసక వజ్రము కంటే స్త్రీ వజ్రము, స్త్రీ వజ్రము కంటే పురుష వజ్రము శ్రేష్ఠమని పండితుల అభిప్రాయము.

వజ్రములో గల దోషములు 'బృహత్సంహిత' గ్రంథములో చెప్పబడినవి. వీటిలో ముఖ్యముగా స్వచ్ఛముగ, కాంతి వంతముగ లేకపోయినా, కాంతిలో పరీక్షించినప్పుడు బీటలు గానీ, నీటి చారలు గాని కనిపించినా కాకి పాదం లాంటి మచ్చలు, నల్లగా వెంట్రుకల వంటి గీతలు, మట్టిగానీ, యితరముల యొక్కఅవశేషాలు కలిగి యున్నా , గాలి బుడగలు, చుక్కలు లాంటివి దోషాలు గల వజ్రములుగా పేర్కొని, అవి ధరించరాదని చెప్పబడింది.

రత్న శాస్త్ర ప్రకారము దోషములు 2. అవి

| | | |
|---|---|---|
| కాక పాదము | - | కాకి పాదము వంటి నల్లటి రేఖలు నిలువుగా అడ్డముగా వుండేవి. వీనిని ధరించిన మృత్యుప్రదం. |
| ముండ్రము | - | కాంతి మందముగను, మురికిగా అంచులు లేకుండా మడ్డిగా వుండేవి.వీటిని ధరించిన కష్టనష్టములు కలిగే అవకాశముంది. |

లోపల అటుక గింజ వలె కనపడిన అది 'చిపిలు' దోషము. అట్టి దోషము గలది ధరింపరాదు. మరియు లోపల నల్లని చుక్కలు గానీ, బీటలు గానీ ఎర్రని చుక్కలు గానీ గల వజ్రము ధరింప రాదు.

ఇనుప దిమ్మెపై పెట్టి సమ్మెటతో బలముగ కొట్టినను, వజ్రము పగలదు. నీటిలో వేసినా మునగదు. ఆకురాయితో అరగదీసినా అరగదు. రంపములతో కోసినా

గీత కూడ పడదు. అటువంటి వజ్రము ధరించుట వలన సకల సంపదలు, శుభములు కలుగును. ప్రకాశవంతమయిన మెరుపు కాంతి విరజిమ్మే వజ్రము మాత్రమే ధరింపవలయును.

వజ్రము ఎంత గట్టి పదార్ధముతో కొట్టినను పగలక, నీటిలో వేసినా మునగక, అరగదీసినా అరగక ఎటువంటి గీతలు పడకుండా వుంటేనే ఉత్తమమయిన వజ్రం.

పూర్వ కాలము నుండి మన దేశమునకు ప్రత్యేకత వుంది. 1756 సం॥లో బ్రెజిల్ దేశములో వజ్రాల గనులను కని పెట్టేంత వరకు భారత దేశము నుండే ఇతర దేశములకు వజ్రాలు సరఫరా అవుతుండేవి. ప్రతి సంవత్సరము 5000 క్యారెట్ల బరువు గలవి అమ్మబడేవి. 1756 నుండి బ్రెజిల్ ఈ రంగంలోకి దిగిన తర్వాత బ్రెజిల్‌దే ప్రముఖ స్థానము. 1875 సం॥లో దక్షిణాఫ్రికా దేశంలో గల కింబర్లి గనులు ప్రఖ్యాతి వహించాయి.ఈనాడు దక్షిణాఫ్రికాదే అగ్ర స్థానము.

మన భారత దేశములోని ప్రముఖ దేవాలయములలో దేవునికి నేత్రముగా వుంచబడినవి. కృత్రిమ వజ్రములను తయారు చేయుటకు HENRI MOLSSAN ప్రయత్నించి విఫలమయ్యాడు. 1880 తర్వాత అనేక పరిశోధనలు జరిగి 1955లో జనరల్ ఎలక్ట్రిక్, న్యూయార్క్ వారు 2760 డిగ్రీల వద్ద కర్బనాన్ని వజ్రంగా తయారు చేసి సఫలీకృతులయినారు.

నదీ తీరపు గనులలో నీటి ప్రవాహములు వచ్చే ఒండ్రుతో కలిసి ఎక్కువగా లభ్యమవుతున్నాయి. భారతదేశములో గల పలు ప్రాంతములలో వజ్రాల ఉత్పత్తిలో పేరు పొందింది. ఆంధ్రప్రదేశ్‌లో గల గుంటూరు జిల్లా కొల్లూరు, అనంత పురం జిల్లా వజ్ర కరూర్‌లు గోల్కొండ గనులుగా ప్రసిద్ధి చెందాయి. ప్రపంచంలో ప్రసిద్ధమయిన వజ్రములు ఈ గనులలో లభ్యమయినవే. మధ్య ప్రదేశ్‌లో గల పన్నా జిల్లా వజ్రాలకు ప్రసిద్ధి గాంచింది. దక్షిణాఫ్రికాలో కింబర్లీ గనులు, బ్రెజిల్, ఆస్ట్రేలియా, ఘనా, సిరియా, జైరే, బోట్సువానా, నమీబియా, రష్యా, అమెరికాలలో లభ్యమవుతున్నాయి.

## భారత దేశములో లభించిన వజ్రములు :-

1650 సంవత్సరములో గ్రేట్ మొగల్ వజ్రం అర్ధచంద్రాకారము గలది దొరికినప్పుడుబరువు 793 క్యారెట్లు కాగా సాన పెట్టిన తరువాత బరువు 280 క్యారెట్లు ఉంది.

1304 సంవత్సరములో కోహినూర్ వజ్రం అర్ధచంద్రాకారము గలది దొరికినప్పటి బరువు 191 క్యారెట్లు కాగా సానపెట్టిన తరువాత 108-93 క్యారెట్లు ఉంది.

1477 సంవత్సరములో ఫ్లొరెన్ టయిన్ వజ్రం అర్ధచంద్రాకారము గలది లభ్యమయినప్పటికీ సాన పెట్టగా 137.00 క్యారెట్లు వుంది.

1570 వ సంవత్సరంలో శాన్సీ వజ్రములు పసుపు రంగు కలిగి సాన పెట్టిన తరువాత 533.4,66.4 క్యారెట్లు బరువుగా వున్నాయి.

1000వ సంవత్సరములో షా వజ్రము స్థూపాకారము కలిగి సానపెట్టగా 88.7 క్యారెట్లు బరువుంది. 1668 వ సంవత్సరం హోప్ వజ్రము స్థూపాకారము, ముదురు నీలం రంగు కలది సానపెట్టిన తరువాత 44.5,67.8 క్యారెట్లు కాగా లభ్యమయినప్పటి బరువు 1668 క్యారెట్లు.

1701 సంవత్సరములో రీజంట్ వజ్రము పసుపు రంగు కలిగి స్థూపాకారము గలది దొరికినప్పటి బరువు 410 క్యారెట్లు కాగా సాన పెట్టిన తరువాత 140.5 క్యారెట్లు వుంది.

1750 వ సంవత్సరములో ఓర్లాఫ్ వజ్రము అర్ధచంద్రాకారములో సాన పెట్టిన తరువాత 199.6 క్యారెట్లు బరువుంది.

వీటిలో 1668 సంవత్సరములో లభ్యమయిన హోప్ వజ్రము తర్వాత కాలం పరిశోధనలలో నీలంగా మారింది.

వజ్రము విశేషముగా ప్రకాశవంతముగా తెలుపు రంగులో వుంటుంది. దీనికి అధిపతి రాక్షస గురువైన శుక్రుడు. దీనికి పులకము, హీరము, మగమానికము, కుంతము, కులిశము, గిరి జ్వరము, గిరి కంతు, వజ్రము, మూల రాయి, నిర్ఘాతము, చితకము అనే పేర్లు గలవు.

వజ్రము గట్టిగా, కఠినముగా వుంటుంది. దీనిని సాన పట్టుటకు వజ్రమే కావాలి. వజ్రములు కృత యుగములో పర్వత ప్రదేశములందు, త్రేతాయుగములో కాశ్మీర్,కోసల దేశమందు, ద్వాపర యుగములో పౌండ్రక, సౌరాష్ట్ర దేశములలో లభ్యమయ్యేనని పురాణముల ద్వారా తెలుస్తోంది. ప్రస్తుత కాలములో మన రాష్ట్రములో అనంతపురం జిల్లా వజ్ర కరూర్‌లోనూ, పరిసర ప్రాంతములో వజ్రములు లభ్యమగుచున్నవి.

మల్లె పూవు వలె అమిత తెల్లగా ప్రకాశింపగల వజ్రము ధరించిన సకల భోగములు, సంపదలు కలుగును. కొంచెము ఎరుపు రంగులో వున్నది ధరించిన సకల జన వశీకరణము కలగలేదు. కొంచెము పసుపు పచ్చగా వుండునది ధరించిన సంపదలు కలుగజేయును. సకల ఐశ్వర్య ప్రదము. కొంచెము నీలం రంగులో వుండునది దరిద్రమును, అనేక కష్టనష్టములను కలగజేయ గలదు.

వజ్రమును బొగ్గుల చూర్ణములో మంచి కొలిమిలో పెట్టి ఎంత సేపు కాల్చినా చూర్ణముగా మారదు. ఉలవ గంజిలో ఇంగువ, సైంధవ లవణము వేసి దానియందు వజ్రమును వుంచి 21 సార్లు కాల్చిన మాత్రమే భస్మముగా మారగలదు.

ఎలుకలు, పాము కుబుసము, మేక కొమ్ము, తాబేలు బొరుసు, పుల్ల ప్రబలి, కుందేటి పల్లులను ఎండబెట్టి, చూర్ణం చేసి ఆ చూర్ణము సమ భాగాలుగా తీసుకొని దానియందు వజ్రముంచి అగ్నిలో పెట్టిన వజ్రము భస్మము కాగలదు.

వజ్ర భస్మము సేవించిన వీర్యవృద్ధియును, బలము, తేజస్సు, ఉత్సాహము కలుగును. శరీర దౌర్బల్యములను తొలగించి చురుకుతనము కలిగించును.

## వజ్రము ధరించుట వలన లాభములు :-

వజ్రము ధరించుట వలన నూతన తేజస్సు, భోగ భాగ్యములను కలగజేయును. స్త్రీలు వజ్రము ప్రసవ సమయంలో ధరించిన సుఖ ప్రసవమగును. కలరా, ప్లేగు లాంటి అంటు రోగములు దరి జేరవు. భార్యా భర్తల మధ్య అన్యోన్యత లేక కలహములు జరుగుతున్నప్పుడు ధరించిన వారి కలహములు అంతరించి సంసార జీవితములో వారికి సుఖ సంతోషములు కలుగును. సకల జన వశీకరణను కలగ జేయ గలదు. శత్రువులు మిత్రులుగా మారగలరు. వజ్రము సహజ కాంతి కలిగి తేలికగా వుంటుంది.

జాతకములో జన్మ లగ్నములకు శుక్రుడు 6, 8, 12 స్థానములో గానీ, నీచయందుగానీ ఉండి శుక్ర మహా దశ జరుగుచున్నపుడు దరిద్రము, అనేక కష్టనష్టములు కలగజేయును. యుక్త వయసులో వుండి వివాహము కాని యువతీ యువకులు వజ్రపుటుంగరము ధరించిన త్వరలో వివాహము జరగగలదు. జాతకములో కుజ దోషము ఉన్నప్పుడు వజ్రమును ఉంగరములో ధరించిన కుజ దోషము పరిహారమవగలదు.

వివాహ సమయములో వధూ వరులు ఉంగరములను పెట్టుకునేటప్పుడు అట్టి ఉంగరములు వజ్రము పొదిగినవి ధరించుట వలన ఆ యువతీ యువకుల మధ్య వివాహము జరిగిన తర్వాత వారి మధ్య అన్యోన్యత పెరిగి వారి వైవాహిక జీవితము సుఖప్రదంగా వుంటుంది. వజ్రము ధరించుట వలన సుఖ రోగములు నివారణ కాగలవు. శ్లేష్మము, పొడిదగ్గు, క్షయ, ఉబ్బసము లాంటి వ్యాధులు, అనారోగ్యములు వజ్రము ధరించుట వలన తొలగిపోవును. పురుషులకు వీర్య నష్టము, స్త్రీలకు తెల్ల బట్ట లాంటి వ్యాధులు వజ్రము ధరించుట వలన అట్టి దోషములను నశింపజేయగలదు. సంగీత సాహిత్యము, భరత నాట్యము, చిత్ర లేఖనము, లాంటి లలిత కళలయందు అభిరుచి కలవారు వజ్రము ధరించిన పై వాటిలో ప్రావీణ్యము సంపాదించి కీర్తి, ప్రతిష్ఠలను తెచ్చుకుందురు. సినిమా రంగంలోని వారికి వజ్రము ధరించిన వారి అవకాశములు మెరుగుగా వుండ గలవు. చర్మ వ్యాధులు, మలేరియా జ్వరములు గల వారు వజ్రము ధరించిన పై వ్యాధులు తగ్గగలవు.

# 7. నీలము (SAPPHIRE) CORUNDUM

స్ఫటికామ్ల జనిత లోహ జాతికి చెందినది. ఇది శని గ్రహానికి ప్రతీక. ఒక్క ఎరుపు రంగు తప్ప మిగిలిన రంగులన్నీ సఫైర్‌గా భావిస్తారు. అయితే సఫైర్ అనగా నీలముగానే భావిస్తారు. తెల్లని కాంతిలో ఒక రకమయిన నీలం రంగు విరజిమ్ముచు మరొక రక నీలంగ కనిపించగలదు.

## నీలం మూడు రకములు :-

1. ఇంద్రనీలం 2. మహానీలం 3. నీలమణి

| | | |
|---|---|---|
| ఇంద్ర నీలం | - | తల వెంట్రుకల వంటి నల్లటి రంగు. |
| మహానీలం | - | భూమి మీద పెట్టినప్పుడు ఆ ప్రాంతమంతా నీలముగనే కనిపిస్తుంది. |
| నీల మణి | - | విష్ణుకాంత (కృష్ణ) పుష్పాల వలె ప్రకాశించేవి. |

ఇందులో మయూర నీలం, నెమలి కంఠము రంగు నీలంలో వుంటుంది.

ఇంద్ర నీలము ధరించిన ఇంద్ర భోగములు కలుగును. మహానీలము ధరించిన మహాశక్తి కలిగి దరిద్రమును తొలగించగలదు. నీలమణి ధరించిన కష్టములు నశించి సుఖ శాంతులు పొందగలరు. అంతే గాక ఇంద్రము, అశ్మ సారము, తృణమణి, మాసారము, సుసారము, గల్వర్కము, బోదకము అని కూడా పేర్లు కలవు.

## నీలములో గల దోషములు :-

నీలములో త్రాస, భిన్న పటల, పాషాణ, గర్భ, మృద్గర్భ, రక్తబిందువు అనే ఆరు రకముల దోషములు కలవు. నీలము పగిలినచో 'త్రాస' అనే దోషమునూ, దీనిని ధరించిన సర్వత్రా కలహములు కలుగుచుండగలవు. కళాహీనముగా మడ్డిగా యున్న 'భిన్న' దోషమునూ, దీనిని ధరించిన బంధువులతో విరోధము కలగజేయగలదు. నీలము లోపల పగిలియున్నట్లు కనిపించిన 'పటల' దోషమునూ, దీనిని ధరించిన కష్టనష్టములు కలగగలవు. నీలములోపల యిసుక కనపడిన 'పాషాణ గర్భ' అనే దోషమునూ, దీనిని ధరించిన సంతాన నష్టము కలగ గలదు. నీలమణి లోపల మెత్తని మన్ను వుండిన 'మృద్గర్భ' అనే దోషమునూ, దీనిని ధరించిన ప్రాణభయము, ఆపదలు కలగ గలవు. నీలముపై రక్తపు చుక్కలు లాంటివి వున్న 'రక్త బిందువు' అనే దోషమునూ, అది ధరించిన సంవత్సరములోపు మరణము కలుగునని తెలియజేయడమైనది.

అంతేకాక సహజ కాంతి లేక కళాహీనముగ వున్న 'మలిన' దోషమనియు, సహజ నీల కాంతులను వెదజల్లక వేరు కాంతులతో వుండిన 'విచ్ఛాయ' దోషమనియు అది ధరించిన కష్టములు కలుగును.

నీలము అరచేతిలో పెట్టుకుని చూసిన అడుగున గల అరచేతిలో గీతలు స్పష్టంగా కనపడుచు, తెలుపుగ వుండి కళాహీనముగ వున్న, అది 'కుక్షి' దోషమనియు అంటారు. అటువంటి నీలము ధరింపరాదు.

నీలము అరచేతిలో వుంచి చూసినప్పుడు లోపలగానీ, పైనగానీ ఉలవగింజ ఆకారములో గానీ, మరేకారములో గానీ నల్లని మచ్చలు వుండిన దానిని 'కరంజి' దోషమనియు అది ధరించిన అందరితో విరోధము సంభవించగలదు.

నీలములో ఏటి నీటి వంటి నెరుసులు కనపడిన దానిని 'వాలుకా స్పర్శ' అనే దోషమని, దీనిని ధరించిన దరిద్రము సంభవించగలదు.

నీలము ఆవుపాలలో వుంచి చూసిన ఆ పాలు నీలవర్ణముగా గోచరింపగలవు. ఆ ప్రకారముగా వున్న అది 'క్షీరగ్రాహి' అని పిలుస్తారు. ఆ విధమయిన నీలము ప్రశస్తమయినది. జాతి నీలముగా భావించి ధరించవచ్చును.

పచ్చగడ్డి పరకలు, ఊక, గసగసాల పొట్టు నీలముపై వుంచి ఊదిన అవి ఎగిరిపోక నీలమును అంటి పెట్టుకుని మున్న ఆ నీలము తృణగ్రాహి అని పేరు. ఏ విధము అయిన దోషము లేని ఇంద్రనీలము గానీ, మహానీలము గాని ధర ఎక్కువగా వుంటుంది.

కాంతులతో ప్రకాశించు నీలము ధరించిన సకల సంపదలు పొందగలరు.

నీలము పద్మరాగము కన్నా కఠినముగ గట్టిగా వుంటుంది. వజ్రము తర్వాత కఠినమయినది నీలమే. సానపెట్టుటకు నీలము సాధ్యము కాదు. నీలము లోపల భాగములో ఇంద్రధనస్సు వంటి కాంతులు కలిగి నీలిరంగులో కనపడిన అది ఇంద్రనీలము. అది ఖరీదు ఎక్కువగానే వుంటుంది. మనోహరములయిన నీల కాంతులలో ప్రకాశించి గడ్డిపరకలను, ఊకలను ఆకర్షించిన అదే మహానీలము.

అంతేకాక పుష్యరాగ నీలమనియు, కెంపునీలమనియు, సిలోన్ (శ్రీలంక) నీలమని అనేక రకములు గలవు. కాశ్మీర్ నీలము, కాకి నీలము అనే రకములు కూడా కలవు.

కెంపు నీలము నేరేడు పండు వంటి నలుపు రంగు కలిగి ముండి కొద్దిగ ఎరుపు రంగులో కలిసి వుండునది కెంపు నీలము. తెలుపులో నలుపురంగు కలిసి ముండునది పుష్యరాగ నీలము. కాకి నీలములు చూచుటకు నల్లగను, లోపల ఎరుపు కలిగియుండి ప్రకాశహీనముగను, సిలోన్ నీలము కొంచెము లేత రంగులో, మరియు ముదురు రంగులోనూ, కింద భాగము మాత్రము తెల్లగ వెలవెలపోయినట్లు వుండును. కాశ్మీర్‌లో లభ్యమగు నీలములు కెంపు నీలములు. నీలము ఆకాశమువంటి నీలిరంగులో గానీ, సముద్ర జలము వంటి నీలములో గానీ వుండును. అరచేతిలో పెట్టి చూసిన అరచేతి యందు గీతలు స్పష్టముగ కనపడిన ఆ నీలము శ్రేష్ఠమయినది. నీలములు బర్మా, కాశ్మీర్, శ్రీలంక, సయాం, ఆస్ట్రేలియా, కాంబోడియా దేశములలో లభ్యమగుచున్నవి. ఈ రత్నములలో విద్యుచ్ఛక్తి వంటి శక్తి కలిగియుండి శనిగ్రహము నుండి లభించు శక్తిని గ్రహించి మన శక్తిని గ్రహించి మన శరీరములో ప్రవేశింపజేయగలవు.

## నీలము ధరించుటవలన లాభములు :-

నీలము ధరించిన శరీరములోనికి శక్తి ప్రవేశించి తేజస్సు, నూతనోత్సాహము కలగజేయగలవు. నరముల దుర్బలత్వము, పక్షవాతరోగములను నశింపజేయగలదు. మానసిక రోగములను, పైత్య వ్యాధులను, మోకాళ్ళ నొప్పులను, మానసిక

వ్యాధులను, పిత్త, పైత్య వ్యాధులను తగ్గించ గలదు. ఎలుక కాటు వలన వచ్చే జ్వరములు, కుష్టు రోగములను పోగొట్టును. సంఘంలో గౌరవమర్యాదలను కలగజేయును. అపమృత్యు దోషములను హరింపజేయగలదు. ఆకస్మిక ప్రమాదములు జరగకుండా శని దోష నివారణకు ఉపయోగపడగలదు. కష్ట నష్టములు తొలగి సుఖజీవనము సాగించగలరు. ఆదాయము పెరుగును. శత్రువులు మిత్రులుగా మారి సహాయసహకారములందించగలరు. చేసిన ప్రయత్నములు ఫలించి వ్యాపార, ఉద్యోగ, వ్యవసాయాది వృత్తులలో గణనీయమయిన ధనలాభము కలుగును.

నీలములో ఇంద్రనీలము, మహానీలము, నీలమణి (క్షీరగ్రాహి, తృణగ్రాహి), మయూర నీలములు ప్రశస్థములు.

అంతేగాక నీలము ధరించిన దృష్టి దోషములు నశింపగలవు. అజీర్ణము పోగొట్టును. ఆధ్యాత్మిక జీవనము కలుగజేయును. వేదాంతముపై ఆసక్తి కలుగును. మనస్సు ప్రశాంతముగ వుండి స్థిరచిత్తము కలిగి భగవంతునిపై ఏకాగ్రత పెరుగును.

జాతకములో జాతకునికి శని నీచరాశియైన మేషములో వున్నా, జన్మలగ్నమునకు 4, 6, 8, 12 స్థానములలో వున్నా శని మహాదశలో కష్ట నష్టములు కలుగుచున్న ఏమాత్రము దోషము లేని నీలము ఉంగరములో పొదిగి ఎడమచేతి మధ్యవేలుకి గానీ ఉంగరపు వేలుకి గానీ ధరింపవలెను.

ఏలిననాటి శని వలన కష్ట నష్టములతో బాధలను అనుభవించువారుగానీ, గోచారము ప్రకారం అర్ధాష్టమ శని, అష్టమశని ఉన్నప్పుడు జీవితములో అనేక కష్టములు కలిగిన నీలము పొదిగిన ఉంగరము ధరించిన సుఖశాంతులు పొందగలరు. నీలముకి చెక్కదగిన డిజైన్లు BRILIANT, CABOCHON, CAMEO, MIXED, PENDELOQUE.

## 8. గోమేధికము (GOMEDIKAM) CINNAMON STONE

గోమేధికమునకు అధిపతి రాహువు. ఇది గోమూత్రమువలెను, గోమూత్రపు రంగును కలిగి వుంటుంది. దానివల్లనే గోమూత్రమని పేరు కలిగింది. దీనిని ధరించిన అన్నిటా విజయము లభించగలదు. ఆరుద్ర, స్వాతి, శతభిష నక్షత్రములలో జన్మించిన వారు, రాహు మహాదశ జరుగుచున్నపుడు కష్ట నష్టములు కలుగునప్పుడు, భూతప్రేత పిశాచాల వలన బాధలు అనుభవించునప్పుడు ఉంగరములో గోమేధికము ధరించిన ఆ బాధలనుండి విముక్తి కలుగును. గోమేధికము, గోమూత్రపురంగును, తేనెరంగులోను లభ్యమగును. ప్రశస్తములయినవి కొన్ని ఏ రంగును లేక తెలుపు రంగులో వుండి మెరయుచుండగలవు. గోమేధికము కంకరరాళ్ళలో లభ్యమగుచుండును. నదీ ప్రవాహములలో కొట్టుకొని వచ్చుచుండును.

గోమేధికము, వైఢూర్యము, పుష్యరాగము, పచ్చలు స్ఫటిక జాతికి చెందిన రత్నములు. గోమేధికము వజ్రమువలె కఠినముగా వుంటుంది. ఈ రెంటికి తేడా తెలుసుకొనుట కష్టమే.

## గోమేధికములోని జాతులు :-

| | |
|---|---|
| బ్రాహ్మణ జాతివి | తెల్లని కాంతితో కన్పించేవి. |
| క్షత్రియజాతి | మధ్యలో ఎరుపురంగు మిశ్రమంతో కనిపించేవి. |
| వైశ్యజాతి | ఆకుపచ్చ, పసుపు పచ్చ రంగుల్లో కనిపించేవి. |
| శూద్ర జాతి | నలుపు రంగులో మిశ్రమంగా కనిపించేవి. |

## గోమేధికములో గల దోషములు :-

మచ్చలు, చారలు, కాంతిహీనము గలవి ధరించరాదు. వాటిలో గల దోషములలో

| | | |
|---|---|---|
| 1. మల దోషము | - | మలినముగ వుండి కాంతి హీనముగా వున్నది. |
| 2. బిందు దోషము | - | లోపల మచ్చలు ఉండేవి. |
| 3. రేఖ | - | చారలు, గీతలు వుండేవి. |
| 4. త్రాళ | - | బీటలు, ముక్కలుగా విరిగినవి. |
| 5. కాక పాదము | - | రత్నముపై కాకి పాదము వంటి గుర్తులు. |

పైదోషములు గల వాటిని ధరించరాదు. ధరించిన అనేక జరగరాని, అనుకోని చెడు ఫలితములు సంభవింపగలవు.

గోమేధికములు హిమాలయ పర్వతములలోను, శ్రీలంక ప్రాంతములో తపతి నదీ తీర ప్రాంత మందును లభ్యమగును. హిమాలయ ప్రాంతంలో లభించే వాటిలో **సూర్యకాంత గోమేధికము,** సూర్యునికి ఎదురుగా పెట్టినప్పుడు అగ్నిజ్వాలవలె కనిపిస్తుంది. **చంద్రకాంతి గోమేధికము** చంద్రకాంతిలో పరీక్షించిన మంచువలె చల్లగ వుంటుంది. అంతేగాక తెలుపు, ఎరుపు రంగులలో వుండి తళ తళ మెరుపు కలిగి వుండేవి కూడా శ్రేష్టమయినవే. ఇవి ఒక వైపు నుండి చూసిన రెండవవైపు కనపడగలదు.

## గోమేధికము ధరించుట వలన కలుగు లాభములు :-

గోమేధికము ధరించుట వలన సర్వ జన వశీకరణశక్తి కలుగును. ధనలాభము కలుగును. స్త్రీ మూలక సహాయము కలుగును. శత్రువులు మిత్రులుగా మారుదురు. స్త్రీ మూలకముగా సహాయమందగలదు. రాజకీయ రంగములో జయము కలుగును. ఇది అదృష్ట రత్నముగా పరిగణింపబడుతుంది. రోగములు కలగకుండా కాపాడగలదు. స్థిరచిత్తమును కలగజేయును. గోమేధికము హిమాలయ పర్వత ప్రాంతములలో లభ్యమగునవి పౌర్ణమినాటి చంద్రుని వలె తెలుపుగను,

ప్రకాశవంతముగా వుండును. ఇవి పరిమాణములో పెద్దవి . వీటిలో సూర్యకాంత గోమేధికము, చంద్రకాంత గోమేధికము అని రెండు రకములు గలవు. సూర్యునికెదురుగ పెట్టిన అగ్ని జ్వాలలు పైకి వచ్చుచున్నట్లు కనపడగలవు. చంద్రకాంత గోమేధికము చంద్రునికెదురు పెట్టిన మంచువలె మిక్కిలి చల్లగ వుంటుంది. కలియుగములో ఈ విశేషరత్నములు దొరుకుట దుర్లభము.

శాస్త్రసమ్మతము ప్రకారము గోమేధికము, మాణిక్యములను ఆదివారము, ముత్యము, వైఢూర్యములు సోమవారం, పగడమును మంగళవారము, పచ్చను బుధవారం. పుష్యరాగమును గురువారం, వజ్రమును శుక్రవారము, నీలమును శనివారమున పరీక్షించవలయును.

వేసవికాలములో విపరీతమయిన ఎండ వేడిమి వలన మనం గొడుగు ధరిస్తాము. ఎండ నుండి రక్షణ పొందగలం. అదే ప్రకారంగా గ్రహములు దుష్టస్థానములో వున్నప్పుడు కష్టనష్టములు కలిగినప్పుడు విశేష ప్రభావము గల నవరత్నములను ధరించి అట్టి కష్ట నష్టములనుండి రక్షణ పొందగలం. అంతేకాక సుఖసంతోషములు, ఆరోగ్యము కలుగును. దైవకృప కలిగిన మహర్షులు లోకోపకార మనస్తత్వము కలిగి శలవిచ్చిన విషయములు ఆచరించుట మన కనీసధర్మము. రాహుమహాదశలో కలహములు, ఆస్థినష్టములు, విద్యా భంగము, కుటుంబ సమస్యలు, కోర్టులలో వాజ్యములు, రోగ భయములు, ఋణబాధలు, వ్యాపార ఉద్యోగాది వృత్తులలో ప్రతికూలములు ఆర్ధిక బాధలు కలగగలవు. అట్టి సమయములందు గోమేధికము ధరించిన ఆ బాధలనుండి విముక్తి కలిగి సుఖజీవనము సాగించగలరు. మలినముగ, దోషములతో కూడిన గోమేధికము ధరించిన దరిద్రము తాండవించి కష్ట నష్టములు కలగగలవు.

## 9. వైఢూర్యము (CAT'S EYE)

HARDNESS - 8.5

ముదురు పచ్చ రంగులో మధ్య సన్నని గీతలు (కన్ను వలె) గల రత్నం వైఢూర్యము. వివిధ రకములయిన రంగులలో గట్టిగనే యుండే రత్నం వైఢూర్యము.

వీటిలో 2 రకములు గలవు. అవి 1. Alexamdrite2. Cat's Eye

ఈ రెండింటికినీ వేరు వేరు లక్షణములను కలిగి వున్నాయి. కొన్ని లక్షణాలలో సారూప్యత గలదు. పసుపుపచ్చరంగు కలిసిన బూడిద వర్ణములో, మధ్య తెల్లని రంగులో సన్నని రేఖలు వుంటాయి. అలానే బంగారు వర్ణములో కలిసిన గోధుమరంగులో (Golden Brown) మధ్యలో తెలుపు, తేనె రంగుల మిశ్రమంలో వుండేది అత్యంత విలువ కలది.

వైఢూర్య లక్షణములలో రత్న శాస్త్రములో పేర్కొనబడిన విషయములలో గమనించిన పగలు సన్నని సందులో నుండి చూసిన పిల్లి కన్నువలె మెరుస్తుందనీ,

గచ్ఛకాయరంగు, గోధుమరంగు, తెలుపు, నలుపు, బంగారు రంగులోను లభ్యమవగలవనీ తెలియచున్నది. ఎక్కువగా గచ్ఛకాయం రంగులోనే లభ్యమవుతున్నాయి.

దీనికి అధిపతి కేతువు. ఈ రత్నము కేతువునకు ప్రియమయినది. దీనికి ఏకమాత్రము, ఖరాబ్జాంకురము, పిల్లి కన్ను అనే పేర్లు గలవు.

వైఢూర్యము ధరించిన భూతప్రేతపిశాచములు వలన ఎప్పుడూ బాధలు కలగవు. మంత్ర తంత్రములు ఇతరులు తనపై ప్రయోగించిన నిష్ఫలమగును. శత్రువు తన దరిచేరలేక వెనుతిరిగిపోవును. స్త్రీలు ధరించిన సుఖప్రసవమవగలదు. స్త్రీలు ప్రసవించు సమయమునకు ముందు ఒక చిన్న పాత్రలో జలము పోసి, అందులో వైడూర్యముంచి, కొంతసేపటి తర్వాత ఆ నీటిని లోపలకి సేవించిన సుఖప్రసవమగును. వైడూర్యమును నేతిలో వుంచి, ఆ నేతిని ప్రసవ సమయములో ఆ స్త్రీ సేవించినా సుఖప్రసవమగును. వైఢూర్యము గల ఉంగరము స్త్రీ ధరించినను మంచిదే. వైఢూర్యము స్త్రీలకు సౌభాగ్యము, ఆయుర్వృద్ధిని కలగజేయును. వీటిలో పులికన్ను, నలుపు, కృష్ణవైఢూర్యము, నీలమణులు క్రాసుగ సూత్రములు గలవి అనేరకములున్నవి. నీలంరంగులో వున్నవి కృష్ణవైడూర్యము, బంగారు రంగులో గలది. కృష్ణవైఢూర్యము, బంగారురంగులో గలది. కనక వైఢూర్యము అని చెప్పబడింది.

మఖ, మూల, అశ్విని నక్షత్రములలో జన్మించినవారు, కేతుదశ జరుగుచు కష్టనష్టములు కలిగినవారు వైఢూర్యము ధరించిన కష్టములు తొలగి జీవితములో సుఖశాంతులు ఆనందము పొందగలరు.

వైఢూర్యములో 4 జాతులు గలవు. అవి

1. బ్రాహ్మణజాతి - తెలుపు నలుపు రంగుల మిళితమయిన రంగు.
2. క్షత్రియజాతి - తెలుపులో ఎరుపు రంగు మిళితమయిన రంగు.
3. వైశ్యజాతి - పసుపులో నలుపు రంగు మిళితమయిన రంగు.
4. శూద్రజాతి - నలుపు రంగు మాత్రమే కలది.

## వైఢూర్యమునకు గల లక్షణములు ముఖ్యముగ :-

1. సుతారము - శ్రేష్టముగల రంగు, రూపములో గలది. 2. ధనము - ఎక్కువగ బరువు కలిగి చూచుటకు చిన్నదిగా వుండేది. 3. అత్యచ్ఛము - ఎటువంటి దోషములు లేక కాంతిగా మెరియునది. 4. కలిలము - అత్యద్భుతముగ కళ కలిగి వుండేది. 5. వ్యంగ్యము - లోపల అంతా కనిపిస్తూ ప్రతిబింబము పడుతూ వుండేది. ఈ పై లక్షణములు కలిగినవి శ్రేష్టములయినవి.

వైఢూర్యములో గల దోషములను పరిశీలించిన 5 దోషములు కలవు. అవి

1. కర్కరము - గువ్వరాయి వలె కనిపించునది. అది ధరించిన కలహములు కలిగే అవకాశముంది.

2. కర్కశము - చేతిలో పట్టుకున్నపుడు గరుకుగా ఉండేది. అది ధరించిన మానసిక అశాంతి కలుగును.

3. త్రాసము - బ్రద్దలయినట్లుగను, ముక్కలుగ వూడి పోయినట్లుగను కనిపించేది. అది ధరించిన నాశనం జరిగి అష్టకష్టముల పాలగుదురు.

4. దేహము - మలినముగ, కాంతి తగ్గినట్లు కనిపించేది. అది ధరించిన అశుభములు కలుగగలవు.

5. కళంకము - విరుద్ధము (వ్యతిరేకము) గల రంగులలో కనిపించేవి. అది ధరించిన దరిద్రదేవతకి ఆహ్వానము పలకటమే.

అంతేగాక వెలవెలపోయినట్లుగను, మలినంగను, పగిలినట్లుగను, మట్టి, రాళ్ళు ఉన్నట్లు తేలికగ, నల్లగా వుండేవి దోషములు కలిగినవి.

వైఢూర్యములు బర్మా, సిలోన్ (శ్రీలంక) బ్రెజిల్, చైనా, ఇండియాలలో లభ్యమవుతున్నాయి. దీనికి కొండగాజు అనే పేరు కలిగి ఫెరోరాజుల కాలంలో ఆభరణాలలో, ముద్రలుగను వాడినట్లు బైబిల్ గ్రంథములో 28వ అధ్యాయము, 6వ వాక్యములో చెప్పబడింది.

దీనికి గల ఇతర పేర్లలో ముఖ్యముగా కేతుప్రియం, వైఢూర్యము, పిల్లికన్నురాయి, కేతురత్నం, ఖరాబ్జాంకురము, ఏకసూత్రము, విదురాజము, విడలాక్షి, అగ్రరోహ, మేఘరాంకుర, బాలసూర్య మొదలగునవి.

ఈ వైఢూర్యమును ప్రస్తుత కాలములో కొందరు Cat's Eye అని, మరికొందరు Lapis Lazil అనే పేర్లతో ఎక్కువగా పిలవటం జరుగుతోంది.

ప్రకృతిలో సున్నపురాతి నుండి లభిస్తున్నది. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన Lapis Lazil శిలలు ఆఫ్ఘనిస్థాన్‌లో వున్నాయి. అదేవిధంగా అర్జెంటైనా, రష్యా, చిలిలో లభ్యమవుతున్నాయి. అమెరికాలో ముదురునీలం రంగులోను, కెనడాలో లేత నీలం రంగులోను అభ్యమవుతున్నాయి.

ఇవి కృత్రిమంగా ఫ్రాన్స్ దేశస్థులు ప్రయోగశాలలో తయారుచేయటం జరిగింది. వెలవెలపోయే రత్నాలకి రేడియేషన్ ద్వారా మంచిరంగువచ్చేలా తయారు చేయటం జరిగింది. ఈ రేడియేషన్ ఎక్కువ కావటం వలన కేన్సర్ వ్యాధి రాగల అవకాశములు ఎక్కువగా వున్నాయి.

## వైఢూర్యము ధరించుట వలన కలిగే లాభములు :-

వైఢూర్యము అసాధారణ శక్తులు గలది. అమిత ప్రభవముగలవిగా మహర్షులును, రత్నశాస్త్ర గ్రంథములలో తెలియజేసినారు. వైఢూర్యము ధరించిన ఒక విధమగు దివ్యశక్తి లభించగలదు. మనశ్శాంతి కలుగును. సర్వజన వశీకరణ శక్తి కలుగును. ప్రముఖులతో పరిచయము కలుగును. దరిద్రము తొలగి ధనలాభము

కలుగును. శత్రువులపై విజయము లభించును. ఆరోగ్యము బాగుండును. గ్రహదోషములు తొలుగును. ప్రయత్నించిన కార్యములు నెరవేరగలవు. ఆకస్మిక ప్రమాదములనుండి రక్షణ లభించగలదు.

ముదురు పసుపుపచ్చ రంగులో వుండి, రత్నములో మధ్య నూలుదారము వంటి సన్ననిగీత యున్న వైఢూర్యము శ్రేష్టమయినది. కొన్నిరకముల వైఢూర్యములు ఎరుపు, ఆకాశనీలము, కలిసిన రంగులో ఉంటాయి. కొన్ని తెలుపురంగులో ఉంటాయి. క్షయ, ఉబ్బసము లాంటి శ్లేష్మరోగములుగలవారు వైఢూర్యము-ధరించిన అనారోగ్యము యొక్క ఉధృతము తగ్గి ఉపశమనము పొందగలరు. చర్మ వ్యాధులను నశింపజేయగలదు. భూత భవిష్యత్తు, వర్తమాన, కాలములో జరుగు విషయములు సులభముగ తన బుద్ధికి గోచరమవగలవు. జ్యోతిషశాస్త్ర పండితులు ధరించిన భూత భవిష్యత్ వర్తమానములు, ప్రశ్నఫలములు సులభముగా చెప్పగలరు. సర్వకార్యములందు విజయము గాంచగలరు. జీవితములో సుఖసంతోషములు పొందగలరు. వైఢూర్యము అదృష్టమును కలగజేయు అమితశక్తి వంతమయినది. దీనిని ధరించిన మేధాశక్తి, ఆలోచనాశక్తి పెరగగలదు.

## నవరత్న ఉంగరము

నవరత్న ఉంగరములో అమర్చబడు రత్నములు సమానముగా వుండవలయును. అన్నియు సమాన పరిమాణములో హెచ్చు, తగ్గులు లేక వుండవలయును. ఒక్కొక్క ఉంగరము చేయించి ధరించుట కంటే ఒక్క ఉంగరముతోనే అన్ని (9) రత్నములు అమర్చి ధరించవచ్చును. ఫలితము ఒకే విధముగ వుండగలదు. ఒక్కో రత్నము ధరించిన ఫలితము ఎలా ఉంటుందో నవరత్నములు ధరించినా అదే ఫలితము కలుగును.

పూర్వకాలములో మహారాజులు, జమీందార్లు, ధనవంతులు విధిగా నవరత్న ఉంగరములను ధరించేవారు. ఆ నవరత్న ఉంగరము వంశపారంపార్యముగా లభించేది. ఆవిధమయిన ఆచారము నేటికి శ్రీమంతుల ఇళ్ళయందు ఉన్నది. నవరత్న ఉంగరము ధరించిన వారు ఎల్లప్పుడు శ్రీమంతులుగా వుండగలమనీ, ఆ ఉంగరము తమ గృహములో వుండుట క్షేమకరమని, అందువల్లనే సుఖసంతోషములు కలిగి వుంటున్నామని వారి ప్రగాఢ విశ్వాసం. ఆవిధమయిన ఆచారము, అభిప్రాయములు సరియైనవని, అవి మహర్షుల అభిప్రాయమని గ్రహించవలయును. అంతేగాక అవి ఏ విధమయిన దోషములు లేనివిగా వుండుట ముఖ్యము. ఆ విధముగ నవరత్న ఉంగరము చేయించిన తర్వాత నవగ్రహజపము చేయించి, నవగ్రహములను, ఆరాధించవలయును. ఆ నవరత్నములలో

నవగ్రహములను ప్రతిష్ఠింపజేసి ధరించాలి. పంచాంగ శుద్ధిగల రోజున కర్త (ధరించు వ్యక్తి) కి చంద్రబలము, తారాబలములు అనుకూలముగ వున్న దినమున నవరత్న ఉంగరము కొనవలయును. (లేక) అట్టి ఉంగరము చేయుటకు కంసాలికి నవరత్నములు కొని కంసాలికి ఉంగరములో అమర్చుటకు ఇవ్వవలెను. ఆ విశ్వబ్రహ్మణుడు పంచాంగ శుద్ధిగల రోజున నవరత్న ఉంగరము తయారు చేయవలయును. ఏకవింశతి మహా దోషములేని శుభలగ్నమున నవరత్న ఉంగరము చేతికి ధరింపవలయును. ఆ దినమున స్నానమాచరించి శుచిగా శుభ్రమయిన (నూతన) వస్త్రములను ధరించి ఇష్టమైన దేవాలయమునకు వెళ్ళి, దేవతాదర్శనము చేసుకొని పూజారులకు యధాశక్తిగ దక్షిణ తాంబూలములనొసంగి నవరత్న ఉంగరము ధరించాలి. ఉంగరము చేసిన విశ్వబ్రాహ్మణునికి నూతన వస్త్రములను సమర్పించి, సత్కరించి ఆ విశ్వబ్రాహ్మణుని ఆశీర్వాదము పొందాలి. నవగ్రహ ఆరాధన, ప్రతిష్ఠలేని నవరత్న ఉంగరములు ధరించిన ప్రయోజనము విశేషముగ వుండదని శాస్త్రము తెలియజేయుచున్నది.

నవరత్న ఉంగరములో ఏ రత్నము ఎక్కడ ఉండవలెనో మహర్షులు రత్నశాస్త్రప్రకారము తెలియజేయబడిన వివరములు.

రవికి మధ్యలో కెంపును, శుక్రునకు తూర్పున వజ్రము, చంద్రునికి ఆగ్నేయములో ముత్యము, కుజునకు దక్షిణమున పగడము, రాహువునకు నైఋతిలో గోమేధికము, శనికి పశ్చిమములో నీలము, కేతువునకు వాయువ్యమున వైఢూర్యము, గురువుకి ఉత్తరములో పుష్యరాగము, బుధునకు ఈశాన్యమున పచ్చ లను నవరత్నములను పొది దించి నవరత్న ఉంగరము చేయించాలి.

ఆ నవరత్న ఉంగరము ధరించిన గ్రహ దోషములు తొలగును. ఆరోగ్యము స్థిరముగ వుండును. దీర్ఘరోగముల నుండి ఉపశమనము కలిగి త్వరలో తగ్గగలవు. ఆయుర్వృద్ధి కలుగును. సర్వజన వశీకరణ కలగగలదు. తేజస్సు, నూతనోత్సాహము కలగగలదు. చేయు ప్రయత్నములు ఫలించి సర్వదా విజయము సిద్ధింపగలదు. ఋణ విముక్తి కలుగును. శత్రువులు మిత్రులుగా మారగలరు. ఉద్యోగ, వ్యాపార, వ్యవసాయాదిగా గల వృత్తులలో ఆదాయము పెరుగును. త్రాగుడు, జూదము, వ్యభిచారము, చోరత్వము లాంటి దుర్వసనములు దగ్గరికి చేరనీయక సుఖ సంతోషములు పొందగలరు. సంఘంలో గౌరవ ప్రతిష్టలు పెరుగును. సంతానము లేని వారికి సంతానము కలుగును. దేవునిపై భక్తిశ్రద్ధలు పెరిగి స్థిర చిత్తము కలిగియుండును. ఏకాగ్రత పెరుగును. సమస్త భోగ భాగ్యములు కలిగి ఆనందముగా కాలము గడపగలరు. కుటుంబ సమస్యలు లేక జీవితము సాఫీగా సాగిపోవును.

అందువలనే ఈ నవరత్న ఉంగరము మిక్కిలి ప్రభావము కలదని మహర్షులు రత్నశాస్త్రములో తెలియజేసినారు.

ఈశాన్యం　　　　　　　తూర్పు　　　　　　　ఆగ్నేయం

ఉత్తరము　　　　　　　　　　　　　　　　దక్షిణము

| | | |
|---|---|---|
| పచ్చ | వజ్రము | ముత్యము |
| పుష్యరాగము | కెంపు | పగడము |
| వైఢూర్యము | నీలము | గోమేధికము |

వాయువ్యము　　　　　　పడమర　　　　　　నైఋతి

## నవగ్రహముల గురించి.......

## రవి

సౌర కుటుంబములో రవి తండ్రిలాంటి వాడు. రవి, చంద్రులు అధికశ్రేష్టులు. సౌరకుటుంబులో రవి ఉన్నత స్థాయిగానీ రాజ్యాధికారమును తెలియజేయగల గ్రహము. రవి ఆత్మస్థైర్యమునకు గుర్తు. నిర్మాణాత్మక స్థితికి సహాయకారి. రవి మన శరీరమునకు కావలసిన రోగనిరోధక శక్తిని కలగజేయగలడు. రవి మనిషిలో ఉత్సాహ నిరుత్సాహములను కలగజేయును. మనిషికి కావలసిన అధికారము, బలము కలిగించును. హృదయస్థానమును పాలించును. రవి గ్రహము కుడి కంటిని పురుషులలోను, ఎడమకంటిని స్త్రీలలోను సూచించును. ప్లీహము, నోరు, మెదడు కూడా రవి పరిపాలనా వయవములే. పాపగ్రహములచే బాధింపబడిన రక్తపోటు, రక్తస్రావము కలిగించును. అంతేగాక హృద్రోగము కలిగించును. అతి ఉష్ణము, పిత్త స్వభావము, మెదడు వాపు వ్యాధికి కూడా మూలము రవి. ముఖముపై దద్దుర్లు, మాటపడి పోవటం, జ్వరములు, మూర్ఛరోగములు, వడదెబ్బ, కురుపులు, శిరోరోగములకు రవి కారకుడు. రవి అధికారములను కలగజేయగలడు. మనిషిలో ఉత్సాహము, ఆనందము, అదృష్టము, ఉన్నత స్థానములనలంకరించవలెనని ఆసక్తి కలుగుటకు, అత్యంత తెలివి తేటలు, ప్రాపంచిక విషయములో విజయము కలుగవలెనని కోరిక కలగటం రవి ప్రభావమే.

## రవి ప్రభావమునకు ధరించవలసిన రత్నము :-

రవి పాప గ్రహములచేత చూడబడినను, బాధింపబడినను పైన తెల్పబడిన రోగముల పాలగుదురు. అటువంటి జాతక ప్రభావము గలవారు "కెంపు" అనే జాతి రాయి ధరించాలి. కెంపు రత్నము ధరించిన రవి వలన కలుగు రోగములు నశింపగలవు. చెడు ప్రభావము నుండి కూడా జాతకుడు రక్షింపబడును. అంతేకాక కన్య, మకర, మీన రాసులవారు కెంపును గానీ దానికి సంబంధము గల జాతిరాయి గానీ ధరించరాదు. రవి కన్యాలగ్నమునకు 12వ స్థానము అంటే వ్యయాధిపతి. మకరమునకు అష్టమాధిపతి. మీనమునకు షష్ఠాధిపతి. షష్ఠాష్ట, వ్యయస్థానములు దుష్టస్థానములు. ఈ స్థానములే రవికి స్వస్థానములయినప్పుడు మాత్రమే అత్యవసర పరిస్థితులలో ఏదోషములు లేని కెంపును పైలగ్న జాతకులు ధరింపవచ్చును.

# చంద్రుడు

చంద్రుడు మనోకారకుడు. తల్లిని తలపింపజేయు గ్రహము. రవి ఆత్మకారకుడైతే చంద్రుడు మనోకారకుడు. చంద్రుడు రాత్రిపూట ఉదయించే గ్రహము. అతిశీతల గ్రహము. దినదినము మార్పులు కలుగును. తేమ కలిగి వుంటుంది. చంద్రునికి ఫలదీకరణము, గర్భము ధరింపజేసి శిశుజననము, మృగముల ప్రేరణ కలిగి వుండటం లాంటి విషయములపై ఆధిపత్యము గలిగి వుంటాడు. అంతే కాక స్త్రీ పురుష సంయోగము, పిండము తయారగు పరిస్థితులు, పిండము రక్షించి చైతన్యపరచటం లాంటి విషయములకు కారకుడు చంద్రుడు. బాల్యావస్థలో జీవికి ఆశనిరాశలు, జయాపజయాలు, మానసిక పటిష్టత, మానసిక దౌర్భల్యము నుండి రక్షించి జీవితమును కాపాడుట యందు సమర్థత గలిగిన గ్రహము చంద్రుడు. జనన సమయములో పాపస్థాన గతుడయినా, పాపగ్రహములచే బాధింపబడినా, చంద్రుడు కలగజేయుఫలితములు అతి దారుణముగా వుంటాయి. మానసిక పరిపక్వత లేకపోవటం, ఎదుగుదల లేకపోవటం, పిచ్చి పట్టినట్లుండటం, చెడు సహవాసములు, తద్వారా వ్యసనములు కలిగి వుండటం, ఆలోచనా రహితముగా మాట్లాడటం, విద్య యందు ఆసక్తి లేకయుండటం లాంటి అవలక్షణములు కలుగును.

శారీరక బాధలు, ఎక్కువగా జ్వరము రావటం, జలుబు చేయటం, మానసిక వత్తిడి లాంటివి కలుగును. అంతేకాక చంద్రుని స్థితి సరిగాలేని సమయములో వ్యక్తులలో అశాంతి కలగటం, అబద్దాలు ఆడటం, అసత్య ప్రచారము చేయటం, అనవసర ప్రసంగాల ద్వారా విరోధము కలిగే పరిస్థితులు కల్పించుకోవటం, ఆదుర్దాగా వుండటం తటస్థింపగలవు.

అంగారకునిచే బాధింపబడిన చంద్రుని వలన జాతకునికి ఉద్యోగమనస్తత్వము, నిర్లక్ష్యవైఖరి కలిగి వుండటం, అవినీతి పనులు చేయటం లాంటివి సిద్ధింపగలవు.

శని యొక్కచెడు ప్రభావము చంద్రునిపై వున్న జాతకునికి అధైర్యము, కృంగి కృశించిపోవటం, నిరాశకు లోనవుట, లోకములో బాధలు అన్నీ తనే అనుభవిస్తున్నాననే చింత కలగటం, వేదాంత ధోరణిలో మాట్లాడటం, మనో నిశ్చలత కోల్పోవటం లాంటివి జరగగలవు.

కుజుని శుభదృష్టి, శుభ స్థానము వలన స్త్రీ పురుషులలో విపరీతయోగములు, వంశాభివృద్ధికి అవసరమయిన శుభకార్యములు నెరవేరవు.

చంద్రుని అశుభస్థితి వలన సంభవించే రోగములలో నేత్ర వ్యాధులు, పిచ్చి, పక్షవాతము, మూర్చ, హిస్టీరియా, చర్మవ్యాధులు, జటుములు, దగ్గు, శూలనొప్పులు, నులి పురుగులు వుండటం, జీర్ణ వాహకముల అవకతవకలు, గొంతు సంబంధ వ్యాధులు, ఉబ్బసము, ఊపిరితిత్తుల వ్యాధులు, అతిగా మద్యము సేవించుట వలన వచ్చే వ్యాధులు, అతి సారము, నరముల బలహీనత, కేన్సర్, అజీర్ణ వ్యాధులు కలగ గలవు.

చంద్రుని అశుభ స్థితికి విరుగుడుగా ఏదోషము లేని తెల్లని ముత్యము ధరించుట క్షేమకరము, జయము. ముఖ్యముగా ముత్యమును వెండి ఉంగరములో ధరించుట మంచిది. మానసిక స్థితికినీ, ఊపిరితిత్తుల విషయములోను మిక్కిలి ఉపయోగకరము ముత్యము.

## కుజుడు (అంగారకుడు, మంగళుడు)

అంగారకునికి మానవ జీవితములో అత్యంత ప్రాముఖ్యము కలదు. కుజదశ 7 సంవత్సరముల కాలమైనా, కుజుని స్థితి జాతకునికి బాగా వున్న అతని జీవితము గొప్పగా, అధికారములో ఉండి ఉన్నత స్థానము పొందగలరు. మనిషిలో వుండే కోరికలు అవి నెరవేరే విధానమునకు కుజుని యొక్క స్థితియే ముఖ్యకారణము. శుభస్థానగతుడయి, శుభగ్రహదృష్టి కలిగి వున్న అంగారకుడు జాతకునికి అమితమయిన మానసిక స్థితిని, శారీరక బలమును కలగజేయును. జాతకునికి సంస్థను గానీ, వ్యాపారముగానీ చేయునటువంటి శక్తియుక్తులను, స్వంత నిర్ణయములు తీసుకునే ఆలోచనాశక్తిని, స్వతంత్ర ప్రతిపత్తిని, స్థిర నిర్ణయములు తీసుకోవటం అన్ని రంగములలో విజయము సాధించాలనే పట్టుదల కలిగి వుండటం, అంతేగాక నాయకత్వము వహించాలనే అభిలాష కలిగియుండటం, రాజకీయ రంగంలో గుర్తింపు కలిగి, ఎదురులేకపోవడం లాంటి లక్షణములు కలిగి యుండును.

కుజుని అశుభస్థితి. అశుభ వీక్షణ వలన ఆ జాతకునికి తీక్షణమయిన జ్వరములు, ప్లేగు వ్యాధి, అమ్మవారు, ఆటలమ్మ, వాపులు, బొబ్బలు, రక్తనాళికలు విచ్ఛిన్న మవటం, గాయాలు, మెదడువాపు జ్వరములు, రక్త స్రావములు, ప్రేగులలో కురుపులు. హెర్నియా, మలేరియా, గర్భ స్రావములు, కండరాల నొప్పులు,

ధనుర్వాతము, విషపురుగులు కరుచుట మొదలగునవి వచ్చే అవకాశములు ఎక్కువగా వున్నాయి.

కుజుని అశుభ స్థితి నుండి జాతకుని రక్షణకై ఎరుపు రంగు గల పగడము ధరించుట వలన చెడు లక్షణములు, వ్యాధుల నుండి ఉపశమనము పొందులయే గాక తగ్గించుకోవచ్చు.

రవి గ్రహమునకు చెప్పిన విధముగనే ఏగ్రహమునకైనా షష్టాష్ట, వ్యయాధిపతుల్ని దృష్టిలో వుంచుకుని ఆ స్థానములు స్వస్థానములయిన మార్గాంతరము లేని స్థితిలో మాత్రమే ఈ జాతిరాయి ఉపయోగించుకోవాలి.

# బుధుడు

ఈ గ్రహము లక్షణములు వింతగా వుంటాయి. ద్వి స్వభావములు కలిగి వుంటుంది. పొట్టివారు, చురుకు తనము గలవారూ, ఎక్కువగా ఎప్పుడూ ముఖముపై చిరునవ్వు గలిగినవారూ వుంటారు. ముసలితనములో యువకులవలె కనిపించుట, సంభాషణలందు చతురత కలిగి యుండటం, ప్రతి మాటలోను హాస్యం వుండటం, అనేక శాస్త్రములలో ప్రావీణ్యత కలిగియుండటం లాంటి స్వభావములు కలిగి వుంటారు. పుస్తక వ్యాపారము, టెలిఫోన్, టెలివిజన్ శాఖలలో రాణించగలరు. వీరు ప్రతివిషయముపై అవగాహన కలిగి వుంటారు. తెలిసిన దానిని పూర్తిగా నమ్మరు. ఎక్కువగా ఆలోచించి సరిగా నిద్రించక పోవుట, సందేహములలో సతమతమగుట వలన నరములకు సంబంధించిన వ్యాధులు, తలనొప్పి, కడుపులో పులపరము లాంటివి వచ్చే అవకాశముంది. అంతే గాక బుధగ్రహము విశ్లేషించుటకు గల శక్తిని ఇవ్వగలడు. అలానే జ్ఞాపకశక్తిని వృద్ధిపరుచును. రహస్య లేక ఇంద్రజాల సంబంధమగు విద్యలందు ఆసక్తిని కలిగించి పూర్తి చేయుట యందు విఫలము కలిగించును.

బుధ గ్రహము పాప స్థానగతుడయిననూ, పాప గ్రహవీక్షణ కలిగినను కేంద్ర వేధలున్నను జాతకుని మోసగానిగా మార్చును. అసత్యవాదిగాను, జూదగానిగానే మార్చి సన్మార్గము విడిచి నీతి బాహ్యునిగా, నిలకడలేని మనస్తత్వము లేని వానిగా, డంబములు పలుకు వానిగ మార్చగలడు.

బుధగ్రహము మంచి స్థానములో వున్నపుడు బుధుడు జాతకుని గణితశాస్త్రములోను, ఇంజనీరింగ్ శాఖలోను, కార్యకర్తగాను, విలేఖరిగాను రాణింపజేయును. ఏపనిలోనైన ఆటంకములు కలగక పూర్తి చేయగలిగే సామర్థ్యము కలిగి వుండును.

బుధుడు పాపస్థానగతుడయిన మందబుద్ధిని కలగ జేయును. మెదడుకి సంబంధము గల వ్యాధుల్ని కలగజేయును. వెన్నువాపులు, కేన్సర్, చర్మ వ్యాధులు, ఉదర సంబంధ వ్యాధుల కలిగే అవకాశములు ఎక్కువగా వున్నాయి.

పైన తెల్పబడిన వ్యాధులే కాక అనేక కష్ట నష్టములను కలగజేయును. వ్యాధులను, చెడు పరిస్థితులను చక్కబరుచుకొనుటకు తోడ్పడునది ఏ దోషములేని జాతిరాయి 'పచ్చ' మాత్రమే.

'పచ్చ' ఉంగరములో ధరించిన వ్యాధులు, చెడు స్వభావములు మారి సుఖసంతోషములు పొందగలరు.

# గురువు

మంచి శరీరము కలిగి, పొడవు, లావు సమముగా వుండునది. ఈ గ్రహము వలన సరియైన వేళకు అన్న వస్త్రములు, వాహన సౌఖ్యము, సుఖ సంతోషములు నమకూరును. మంచి పాండిత్యము కలిగి వుండును. దేవాలయములు, న్యాయశాస్త్రము, చట్టము, బ్యాంకుల వంటి రంగంలో రాణింపు కలిగి పేరు ప్రతిష్టలు కలిగియుందురు. ఇల్లు, స్థిరాస్థులు కలిగి వుందురు. ఇంటిలోను, సంఘంలోను గౌరవ మర్యాదలుండును. మధ్యవయసులోనే వెంట్రుకలు నెరయుట (లేక) బట్టతల కలిగి వుండగలరు. కన్నులు, ముక్కు విశాలముగ వుండును.

బృహస్పతి భాగ్యమునకు, సంతానమునకు, రాజానుగ్రహము (అధికారుల మన్ననలకు) దైవానుగ్రహమునకు కారకుడు. ఈ దేవ గురువు శుభుడు. స్త్రీ జాతకములో భర్తకు కారకుడు. శుభ స్థాన గతుడయి, వేధలు లేని యెడల గురువు మంచి ఫలితముల నివ్వగలడు. గురువునకు, 1, 9, 5 స్థానములు శుభము. రోజువారీ పనులందు కూడ దేవగురుని కృపమున అధిగమించగలం.

దేవగురువు మంచి గుణములు కలిగి, కనికరము గలవాడు. విజయ కారకుడు, చతురత్వము కలిగి ఉల్లాసము కలిగించువాడు. మనస్సున ఉత్సాహము నింపగలడు. శుభముల కొరకు నిరీక్షంపజేయును. ఆశా జనకుడు. ఉన్నత భావములు కలిగిన గ్రహము. వ్యక్తిత్వములను పరిరక్షించువాడు గురువు.

దుష్ట స్థాన గతుడయిననూ, అతిగా ఆశలు పెట్టుకొనుట, అప్పులు చేయుట, వూహించిన పనులు జరగక అవస్థలు పడుట, జూదరిగా మారుట, సంతానము వలన బాధలు కలుగుట, సంతానము లేకపోవుట, గర్వము కలిగి వుండుట, అమితముగా భుజించవలెనని కోరిక కలుగుట లాంటి లక్షణములు కలగగలవు. బృహస్పతి దేహములోని కాలేయము, ధమనులలోని రక్త ప్రసారములు, శరీరములోని కొవ్వును పరిపాలించగలడు.

బృహస్పతి అనుకూలముగా లేకున్న అజీర్ణము, వాపులు, చర్మవ్యాధులు, మధుమేహము, కంటి యందు శుక్లములు, శరీరము బరువు పెరుగుట, నెత్తురు గడ్డలు ఏర్పడుటలాంటి అనేక వ్యాధులు కలగ వచ్చును. కంఠ ధ్వని రంకె వలె వుండగలదు.

పై విధముల బాధింపబడిన దేవగురువుకి ఏ దోషములేని జాతిరాయిగా 'కనకపుష్యరాగము' ధరించిన పైవ్యాధులనుండి, ఇబ్బందులనుండి విముక్తులు కాగలరు.

# శుక్రుడు

పురాణములందు రాక్షసగురువుగా శుక్రుని తెలియజేయబడింది. బలిచక్రవర్తి వామనుల ప్రస్తావనలో విష్ణువు వామన రూపంలో బలిచక్రవర్తి దానమడగగా ఆ సమయంలో శుక్రాచార్యులు కమండంలో అడ్డు పడిపోగా, వామనుడు దర్భతో పొడవగా శుక్రునికి కన్ను ఒకటి పోవడం ప్రస్తావించబడింది. ఈ శుక్రుడు శుభగ్రహముగనే పరిగణించవచ్చు. ఈయన ప్రాపంచిక సుఖములకు అధిపతి. మృత సంజీవినీ విద్యకి అధిపతి. అందమయిన అవయవ సౌష్టవము కలిగి, పొడవు కాని పొట్టి ఎత్తు కలిగి మృదువయిన శరీరము, మెరుపు కలిగి ముండును. మధురమయిన కంఠస్వరము, సంగీతమందు అభిలాష, లలిత కళలందు ఆసక్తి కలిగియుండటం, జనాకర్షణ కలిగియుండటం, అందము నందు ఆపేక్ష కలియుండుట, భక్తి కలిగి యుండటం, ప్రేమించుటయందు ఆసక్తి కలిగి యుండటం, పరవశత్వము పొందుట, సంగీతములో లీనమై పోవుట, నటులు, గాయకులు, వస్త్ర విక్రయదారులు, వాణిజ్యవ్యాపారము కలిగిన వారందరూ శుక్ర గ్రహ అనుగ్రహ పాత్రమైన వారే.

శుక్రుడు సాధు స్వభావి. పరిశుద్ధ గుణములు కలిగి బలమయిన శుక్ర గ్రహస్థితి జాతకుడు. ఎదుటి వ్యక్తుల్ని తేలికగా ఆకర్షించుకొను గుణములు కలిగి యుండును. ఇహలోకములో సుఖ సౌభాగ్యము లిచ్చువానిగా శుక్రుడు చేయగలడు. పురుషుని జాతక చక్రమున భార్య, భార్యతో సంసారసుఖములను గూర్చి తెలియజేయువానిగా శుక్రుని తెలుసుకోవలయును. ఈ శుక్ర గ్రహ స్థితి సరిగా లేకపోయినా వివాహము ఆలస్యముగా జరుగుట (లేక) జరగకపోవటం, సంసార జీవితము సజావుగా సాగకపోవుట మొదలగునవి జరగగలవు. బృహస్పతి వలె శుక్రుడు భాగ్యము నీయగలడు.

శుక్రుడు కంటిని, పునరుత్పత్తి వ్యవస్థని, గొంతుని, గడ్డము, మూత్రపిండములు, చెక్కిళ్ళను పరిపాలించు గ్రహము.

శుక్రుడు పాపియైనా, బాధితుడయిననూ, ఆయన కొన్ని రకాల వ్యాధుల నివ్వగలడు. వాటిలో కంటి వ్యాధులు, ఋతుసంబంధ వ్యాధులు, అండ వాహిక వ్యాధులు, శరీరము లోపల భాగమున రక్తపు గూడలు, వాత రోగములు, రక్తహీనత, అతి సంభోగము వలన వచ్చు వ్యాధులు, అతిగా తినుట. ఈ వ్యాధులు నయమగుటకు సుఖశాంతులతో వుండుటకు మంచి జరుగుటకు ఏదోషము లేని జాతిరాయి 'వజ్రము' ధరించవలయును.

## శని

సన్నగా, పొడవుగా, ఎముకలగూడు వంటి ఆకృతి కలిగి వుంటుంది. ఎక్కువ రోమముల, కురుచగ, బిరుసుగ నుండునని తెలిపి యున్నారు. నడక చాల నిదానము. ఆలోచన కూడ నిదానము. సర్వ కార్యములు అతినిదానముగా జరిపించును. దీర్ఘకోపము, పగ తీర్చుకునే విషయమున సంవత్సరములైనను పట్టగలవు. గోళ్ళు దంతములు పెద్దవిగా వుండును. ఒంటరితనము, దీర్ఘాలోచన, స్వల్పముగ ఆకలి దప్పులు, శుచి, శుభ్రత, స్నానమాచరించుట యందు ఆసక్తి లేకపోవటం, మూఢాచారములందు పట్టుదల ఎక్కువగా వుండుట, దూర ప్రదేశములకు వెళ్ళుట, ఎక్కువగా శ్రమపడుట, తన కష్టనష్టములకు తానే సంతోషించుట, బరువులు మోయు పనులు చేయుట, సేవ చేయుట యందు ఆసక్తి కలిగి వుండుట, ఆరోగ్య శాఖ, పరిశోధన శాఖ, శవపరీక్షలు నిర్వహించుట, చాకలి, మంగలి వృత్తులను స్వీకరించుట, కుటుంబములో సుఖము లేకపోవుట, ఇంటి విషయములను స్వయముగా చూసుకొనుటకు సమయము లేనట్లుగా జీవితము గడుపుట, ఉప్పు, కారములు మితముగా లేకుండ భుజించుట మొదలగు లక్షణములు శనికి ఆపాదించినవే.

శని మంచి స్థానములో (శుభస్థితిలో) వున్న పాటుపడి పనిచేసి ధనలాభము వచ్చునట్లు వివేకముగా వర్తించుట, చేయు ప్రయత్నములలో కార్యసాఫల్యము కలుగుట, సహనముతో వుండుట, మితముగా భాషించుట, రహస్యములను దాచి వుంచు నేర్పు, ఓర్పు కలిగి వుండటం, నిశ్చింత, ఆత్మ నిగ్రహము కలిగి యుండుట, బాధ్యతగా పనిచేసి మన్ననలు పొందుట లాంటి పరిస్థితులు కలగగలవు.

శని పాప స్థానములోవున్న సోమరితనము, మత్తు, ఆలస్యముగా పనులు చేయుట, సఖ్యత లేకయుండుట, కష్టముల పాలగుట, అధైర్యము, నిరాశ నిస్పృహలు కలిగి యుండుట, లాంటి పరిస్థితులు కలగ గలవు.

శని దుస్థానములో వున్న కుడి చెవియందు బాధలు, పంటి బాధలు, జ్వరము, నొప్పులు, అతి త్రాగుడు, కామెర్లు, కీళ్ళ వ్యాధులు, అపరిశుభ్రత, మూగతనము, శూల నొప్పులు, పక్షవాతము, ఆదుర్దాగా వుండుట లాంటి శనిప్రభావము వలన కలుగును. ఈ చెడు ప్రభావముల నుండి రక్షణ పొందుటకు ఏ దోషము లేని నీలము జాతిరాయి ధరించిన చెడు ప్రభావములు తగ్గి సుఖశాంతులు పొందగలరు.

## రాహువు - కేతువు

సూర్యుని చుట్టు భూమి ప్రయాణము చేయు కాలము ఒక సంవత్సరము. భూమి పయనించుమార్గము వర్తులాకారముగా వుంటుంది. భూమి చుట్టు నడుచు మార్గము పాము మెలికల వలె తిరిగి వర్తులాకారముగ వుండును. ఈ రెండు గమనాత్మకమయిన వేగముల వలన ఉద్భవించిన రెండు శక్తులుగా ఉండి పనులు

నిర్వహించును. నీటి యందు ఒక వస్తువును వదిలిన ముందు భాగము ఆ వస్తువు నీటిని చీల్చుకుని పోవుట మనం గమనించగలం. నీరు కదలక కలిగి రేఖలు ఏర్పడినట్లుగానే ఈ మార్గము లేర్పడగలవు. నీటి యొక్కకదలికలకి నీరు కదిలినట్లుగనే భూమి, చంద్రునకు ముందు వెనుకలయందు అయస్కాంత రేఖలు కదులును. ఈ రెండు దారులు సంవత్సరమునకు రెండు సార్లు మాత్రమే ఒకదానికొకటి పరస్పరము ఖండించుకొనును. ఈ ఖండింపబడిన బిందువులనే రాహువు - కేతువులని పిలుస్తాము.

అందులో రాహువు వస్తువునకు ముందు గల నీటి వేగము ధన సంజ్ఞకమయిన వేగము, కేతువు వస్తువునకు వెనక గల నీటి వేగము వలె ఋణ సంజ్ఞము గల రేచక వేగముగా వుండును. ఏ రాశులలో రాహు - కేతువులుందురో ఆ రాశుల స్వభావము ఆ రాశుల అధిపతుల గ్రహముల స్వభావము ధన, ఋణ, రక్తాలతో కదులును. వారితో ఏ గ్రహము కలసినా దాని లక్షణములు, శీలములుండగలవు.

రాశి చక్రములో రాహుకేతువు లిరువురును ఒకరికొకరు 180 డిగ్రీల దూరమున సమాంతర రేఖపై వుందురు. అంతేకాక రాహుకేతువు లిరువురు అపసవ్యమార్గములో సంచరించెదరు. ఈ సంవత్సరము రాహువు ఏర్పడిన బిందువు సుమారుగా 30 డిగ్రీలు ముందుగా రాబోవు సంవత్సరమునకు బిందువు ఏర్పడగలదు. కాబట్టి రాహు-కేతువులు ఒక్కొక్కరాశిలో 1 1/2 సంవత్సరముపైగా వుంటారు.

భూగోళముపై నివసించెడి మానవులకు భూత భవిష్యత్ కాలములు గురుతులుండగలవు. దిక్కుల్ని గుర్తించే శక్తి కలుగుతుంది. మనుష్యులలో ఒక కార్యము నుండి కారణము నూహించు శక్తియును, భూత కాలములో జరిగి పోయిన విషయములను అర్థము చేసుకొను శక్తి ఏర్పడుచున్నవి. అంతే కాక అరబిక్ ఆదిగా గల అపసవ్య లిపులను, ఆ భాషలు మాట్లాడు జాతులతో సంబంధములు ఏర్పడుచున్నవి.

జన్మ సమయములో ఏ రాశిలో రాహువు వున్నాడో అది మంచి స్థానమయిన రాహువు శుభ కారకుడవగలడు.

రాహువుతో కలిసియున్న గ్రహములు శుభముగానీ, అశుభముగానీ బలీయముగా ఫలితము ఇవ్వగలరని తెలియచున్నది. అలాగునే గోచారరీత్యా రాహువు మీద పోవు గ్రహములు శుభఫలితములను కలగజేయుచున్నవని నిశ్చయముగా చెప్పగలం. కేతువు వున్న రాశి స్వభావములు అందులో గోచారమున సంచరించు గ్రహము గానీ నిశ్చయముగా అశుభఫలితముల నివ్వగలదు.

ఈ బిందువులపైన సూర్య, చంద్ర చలనము వలన అమావాస్య, పౌర్ణమిలు ఏర్పడు చున్నవి. అవి గ్రహణములుగను ఏర్పడుచున్నవి. కనుకనే రాహు కేతువులను ఒకే సర్పమునకు తల, తోకయని వర్ణించారు.

రాహువు కలిగించు వ్యాధులలో ముఖ్యముగ కీళ్ళ నొప్పులు, కలరా, అతిసార, శరీరముపై అసహ్యకరమగు వ్యాధులు (కుష్టు, బొల్లి) లాంటివే గాక, ఆత్మహత్యా ప్రయత్నము చేయు అవకాశములను కలగజేయును.

వీటి నుండి రక్షణ పొందుటకు, వ్యాధులు నశింపబడుటకు దోషము లేని జాతి "గోమేధికమును" ధరించవలయును.

కేతువు విషయమున బుధుని వలె చర్మ వ్యాధులను, మొటిమలు, కీళ్ళనొప్పులు, జల, ఉదరము, నెత్తురు, చీము గడ్డలు, పక్షవాతము, నులిపురుగులు, ఆకస్మిక ప్రమాదములు కలగగలవు. ఈ కేతువు యొక్క విషమ ఫలితాలను నివారించుకొనుటకు ఏదోషము లేని 'వైఢూర్యము' అనే (పిల్లి కన్ను రాయి) జాతి రత్నము ధరించవలయును.

పుట్టిన తేదీ తెలియనటువంటి వ్యక్తులు గ్రహములకు సంబంధించిన విషయములను పరిశీలించి తమకి అనుకూలము గల దోషము లేని జాతి రత్నమును ఎంపిక చేసుకోవాలి.

గ్రహములిచ్చు అశుభఫలితములను పారద్రోలుటకు, శుభస్థానములో లేని గ్రహములకు, గ్రహములిచ్చు శుభ ఫలితములను అధికముగ పొందుటకు మనము ఏ దోషము లేని జాతి రత్నములను ధరించవలయును. ఆ ప్రకారముగ ధరించిన అయా గ్రహము వలన కలుగు చెడు ఫలితములు నశించి సుఖ సంతోషములను పొందగలం. జాతి రత్నము మన జాతకమునకు సరిపోతుందో లేదో పరిశీలించిన తర్వాత ఎంపిక చేసుకోవాలి. ఎంపిక చేసిన జాతి రత్నముపై నలుపు చుక్కలు లేకుండా, పగులు లేకుండా, మరకలు లేకుండా అంతే గాక జాతిరాయిని పరిశీలించినప్పుడు దానిలోపల భాగములో గానీ సాలె గూడు లాంటి మరకలుండరాదు. అందువలన జాతి రత్నములను పరిశీలించిన తర్వాత ధరించటం శ్రేయస్కరం, శుభకరము.

## ఎవరు ఏ రత్నము ధరించాలి (జాతక చక్రములను అనుసరించి)

రత్నములు ధరించటానికి ఏ రత్నము, ఎవరికి సరిపోవునో గమనించుటకు ముందుగా ఆ వ్యక్తి యొక్క జాతక చక్రము పరిశీలింపవలయును. జాతక చక్రమును బట్టి జాతి రత్నము నిర్ణయించుకొనుటలో అనేక అభిప్రాయ బేధములు కూడా గలవు. ఒక్కో జాతక పండితులు ఒక్కో రకంగా చెప్పటం జరుగుతుంది. అందులో ముఖ్యముగ జాతక చక్రములో ఏ గ్రహము, పీడింపబడినదో, ఏగ్రహము వలన జాతకునికి బాధలు కలుగుచున్నవో ముందు గ్రహించాలి. జాతకుని బాధించు గ్రహమునకు రత్నము ధరించాలి. అంతే కాక జాతక చక్రము ననుసరించి జాతకునికి జరుగుతున్న దశ, అంతర్దశలను ఏగ్రహము మంచి కలగ జేస్తున్నదో, ఆ గ్రహమునకు సరిపోవు రత్నమును నిర్ణయించుకోవాలి.

మరి ఇంకో అభిప్రాయము ప్రకారం శాస్త్రవిధి ప్రకారము, వర్తించుచున్న పాప గ్రహములకు రత్నములను ఎంపిక చేయరాదనీ, జాతకుని బాధించుగ్రహములకు జాతి రత్నము ఎంపిక చేసికొని ధరించిన ఆ గ్రహము మరింత బలపడి అధికముగా కష్ట నష్టములు కలగజేయగలదనీ చెప్పువారు వున్నారు.

నవగ్రహములను రెండు గ్రూపులుగ విభజించారు. చంద్ర, కుజ, గురువులకు, రవి ఆధిపత్యము వహింపగా, బుధ, శుక్ర, రాహు, కేతువులకు శని ఆధిపత్యము వహించునని లగ్నాధిపతికి సంబంధించినంతవరకు వారి వారి విభజనలో గ్రహములకు మాత్రమే రత్నములను నిర్ణయించాలనే అభిప్రాయము మరికొందరు పండిత శ్రేష్టులు చెప్పుచున్నారు. కానీ అంతగా ఆమోదయోగ్యము కాదనీ రెండవ వర్గమునకు చెందిన గ్రహములకు చెందిన రత్నములు జాతకునికి చెరుపు చేయునని తేల్చిరి. కాని అది సరి కాదని మరికొందరి అభిప్రాయము.

అధికమంది జ్యోతిష్కులు జాతకునికి జరుగుతున్న మహాదశకి సంబంధము గల గ్రహములకు రత్నములను సూచించటం జరుగుతున్నది. జాతకునికి గురుమహాదశ జరుగుచున్నప్పుడు కనకపుష్యరాగము ధరించాలి. శని మహాదశలో నీలము, బుధ మహాదశలో పచ్చ, కేతు మహాదశలో వైఢూర్యము, అలా ఏ గ్రహ దశలో ఆ గ్రహ సంబంధ రత్నములను ధరించాలి అనేది అధిక సంఖ్యాకులైన జ్యోతిష్యశాస్త్రవేత్తల అభిప్రాయము. ఆయినా అనుభవములో సరిపోవుట లేదు కొందరిలో.

సుదీర్ఘ పరిశీలనల తర్వాత అనేక సంవత్సరముల అనుభవముతో నిర్ణయించిన ప్రకారము జాతక చక్రము పరిశీలించి, పాపకారత్వము కలిగి నటువంటి గ్రహములకు (6, 8, 12 స్థానాధిపత్యము కలిగిన ఆధిపత్య పాపులు) రత్నములను నిర్ణయించినచో మనం ఆ గ్రహము వలన కలుగు దుష్ఫలితములు వృద్ధి చేసుకొనుచున్నామని గ్రహించాలి. అటువంటి గ్రహములకు రత్నములను నిర్ణయింపరాదు. ధరించరాదు.

## 'కెంపు' ని ఎవరు ధరించాలి :-

'కెంపు' రవికి సంబంధించిన రత్నము. జాతక చక్రములో రవి శుభ స్థానములో వున్న కెంపు ధరించుట ఉపయోగము. రవి గ్రహము శుభుడై, చెడు స్థానములో వున్న, ఇతర పాపగ్రహములతో వేధించబడుచున్నను కెంపు ధరించవలయును.

## 'కెంపు' ధరించువారు :-

రవి మేషలగ్నమునకు 5వ స్థానాధిపతి, కోణాధిపతి, కుజునకు మిత్రుడు. లగ్నాధిపతి. ఈ లగ్న జాతకుడు కెంపు ధరించుట వలన విశేషలాభములు పొందగలరు. వీరు బుద్ధి కుశలత కలిగి ఆత్మ సంబంధమయిన, దైవసంబంధ విషయములలో అభివృద్ధిని సాధించగలరు. సంతానము పొంది, గౌరవ మర్యాదలు

సంపాదించగలరు. ప్రభుత్వ అధికార్ల మన్ననలను పొందగలరు. రవి మహాదశలో అనేక రకముల అభివృద్ధి సాధించి సంఘంలో కీర్తి ప్రతిష్టలు పొందగలరు.

వృషభలగ్నమునకు రవి చతుర్థాధిపతి. కానీ రవి లగ్నాధిపతి శుక్రునికి శత్రువు. అందువల్ల రవి మహాదశ జరిగేటప్పుడు జాతిరత్నము కెంపు ధరించాలి. రవి తన స్వస్థానమయిన సింహములో వున్నా, 10 స్థానమయిన కుంభరాశిలో వున్న కెంపు ధరింప వచ్చును. కెంపు ధరించుట వలన మానసిక శాంతి, విద్యయందు విజయము, భూములు, ఆస్తులు సంక్రమించగలవు. మాతృవర్గము వారి నుండి సుఖసంతోషములు, వాహనయోగము మొదలగునవే గాక కెంపు అనేక సత్ఫలితములనివ్వగలదు.

మిధున లగ్నమునకు రవి తృతీయాధిపతి. కెంపు ధరించుట వలన ఉపయోగముండదు. రవి తన స్వస్థానమయిన సింహరాశి యందు వుండగా మాత్రమే కెంపుని ధరించాలి. అలా చేసిన ఈ జాతకుడు ధైర్యముగా అన్నివిషయములలో విజయము కలుగును. సోదర, సోదరీలకు అభివృద్ధి కలుగును.

కర్కాటక లగ్నమునకు రవి ద్వితీయాధిపతి. ద్వితీయము ధనము, కుటుంబము, కుడి కన్ను శక్తిని తెలియజేయు స్థానము. రవి చంద్రునికి మిత్రుడు. చంద్రుడు కర్కాటకమునకు అధిపతి. ధనలోపము కలిగిననూ, నేత్ర వ్యాధులు కలిగిననూ, రవి సరిగాలేదని గ్రహించి కెంపు ధరించాలి. ఆవిధముగ ధరించిన ధన సంపాదన పెరిగి, నేత్రవ్యాధులు సమసిపోవును. రెండవయిల్లు మారకమనియు గ్రహించాలి. అటువంటి సమయములో కెంపు మాత్రమే గాక చంద్రునికి ముత్యమును కూడా కలిపి ధరించాలి. అప్పుడే లాభదాయకమగును. శుభఫలితములు కలుగును.

సింహలగ్నమునకు అధిపతి రవి. ఈ లగ్నము గలవారు కెంపు తప్పనిసరిగా ధరించాలి. వీరు ఎల్లవేళలా కెంపు ధరించాలి. రవి స్థానము బాగుండకపోయినా, వేధింపబడినా, బలహీనుడయినా కెంపు ధరించిన రక్షణ కలగగలదు. అనారోగ్యము నుండి కాపాడును. శత్రువుల నుండి రక్షింపబడుదురు. శరీరమునకు శక్తి కలుగును. ఉన్నత పదవుల నదిష్టింతురు.

కన్య లగ్నాధిపతియయిన బుధని రత్నము పచ్చని కలిపి రవి మహదశలో ధరించాలి. తులా లగ్నజాతకులకు రవి ఏకాదశ అంటే లాభాధిపతి అయినా తులా లగ్నమునకు లగ్నాధిపతి శుక్రుడు శత్రువు. ఏదోవిధమయిన వేధింపు రవికి కలిగినప్పుడు భాగ్యము కోల్పోవుట, ధనసంపాదనకి అవరోధములు కలుగుట సంభవింపగలవు. రవి తన స్వస్థానములో వున్నపుడు కెంపు ధరించుట వలన జాతకుడు అదృష్టవంతుడు కాగలడు. ధనధాన్య సంపదలు సంపాదింతురు. అధికుడు, పలుకుబడి గలిగి వుంటాడు జాతకుడు. వాహనముల నేర్పాటు

చేసుకొనును. ఆస్తులు బాగా సంపాదించుకొనును. కెంపు ధరించిన ఆయుర్వృద్ధి కలుగుతుంది. లాభకరమగు ఫలితములు రవియొక్క దశాంతర్దశలలో ప్రస్ఫుటముగ కనపడుతుంది.

వృశ్చికలగ్నము రవికి దశమాధిపతి. వృశ్చికలగ్నమునకు కుజుని ఆధిపత్యము రవి, కుజులు మిత్రులు. కనక కెంపు ధరించిన ఈ జాతకుడు గౌరవ పురస్కారములు ఉన్నత పదవులు, రాజకీయబలము కలుగును. వ్యాపారవేత్తగానీ, పారిశ్రామికవేత్తగానీ అయినా ఆ వృత్తి వ్యాపారములో గొప్ప విజయములు కలుగును. రవి దశమాధిపతి అయిన దశమ స్థానములో వున్నపుడు విపరీతముగా రాజయోగములను కలగజేయును. కెంపు ధరించుటవలన మంత్రిపదవులుగానీ, అత్యుత్తమ స్థానముగానీ పొందగలరు. రవి యొక్క దశాంతర్దశలయందు ఈ ఫలితములు ప్రస్ఫుటముగ కనిపించగలవు. రవిస్థితి బలహీనముగ వున్నా కెంపు ధరించుట వలన చాలా యోగకారకమని చెప్పబడింది.

ధనుర్ లగ్నమునకు రవి నవమాధిపతి ఇది భాగ్యస్థానము పితృస్థానము. ధనుర్లగ్నాధిపతి బృహస్పతి రవికి మిత్రుడు. రవి తన స్వస్థానమయిన 9వ ఇంటిలో ఉన్నపుడు కెంపు ధరించిన చాల మంచిది. వృశ్చికలగ్నమునకు వచ్చు శుభఫలితములనే కెంపు ధనుర్లగ్న జాతుకులకు నివ్వగలదు. అంతేగాక తండ్రి ఆయుష్షు పెంచగలదు.

మకరలగ్నమునకు రవి అష్టమాధిపతి. మకరలగ్నాధిపతి శని రవికి శత్రువు. అందువలన అష్టమాధిపతి అయిన కెంపు ధరించరాదు.

ఏదిఏమైనప్పటికినీ రవి అష్టమంలో స్వస్థానములో వున్నపుడు కెంపు ధరించవచ్చు అంతేగాక రవి మహాదశయందు అందున మకరలగ్న జాతకునికి దీర్ఘాయువు కలుగును. వారసత్వపు ఆస్తి లభించగలదు. ఈ జాతకునికి జీవితకాలములో రవి మహాదశ రాకపోయిన కెంపు ధరించరాదు.

కుంభలగ్నమునకు రవి సప్తమాధిపతి. మారకస్థానము. కుంభలగ్నాధిపతికి రవి శత్రువు. అందువలన ఈ జాతకులు కెంపు ధరించరాదు. సప్తమాధిపతియై రవి స్వస్థానగతుడయిన రవి మహాదశయందు కెంపు ధరించవచ్చును. మన జ్యోతిష్యశాస్త్ర ప్రకారం ఈ ఏడవ స్థానము పదింటికి పదవస్థానమయినందువలన కెంపు ధరించిన శుభపరిణామములు ఏడవయింటికి కలుగునని తెలియజేయబడింది.

మీనలగ్నమునకు రవి షష్టమాధిపతి. ఆరవస్థానము, అశుభము (పాప స్థానము) అందుచే మీనలగ్న జాతకుడు కెంపు ధరింపరాదు. ఏమైనప్పటికీ రవి 6వ యింట స్వస్థానము నందు ఉన్నపుడు రవి మహాదశయందు మాత్రము కెంపు ధరింపవచ్చును. మీనలగ్నాధిపతి గురువుకి రవి మిత్రుడయినందువలన ఉపయోగకారిగా వుండును. కెంపు ధరించుట వలన శత్రుబాధల నుండి విముక్తి, ఋణబాధల నుండి విముక్తి, వ్యాధుల నుండి విముక్తి పొందగలరు.

కెంపు షుమారుగా 2 1/2 కేరట్లు కలిగి వుండాలి. ఏ విధమయిన దోషములుండరాదు. రాగి కలిసిన బంగారు ఉంగరములో ఆదివారమునాడు కెంపుని తాపడము చేయించుకుని సూర్యోదయము అయిన వెంటనే ఆదివారం రోజునే కెంపు ఉంగరము వ్రేలికే ధరించాలి. ఉంగరమునందుగలకెంపు మనశరీరమునకు తాకుచుండవలయును. రత్న ఉంగరము ధరించుటకుముందు కొంతకాలము పాలయందు ఉంచాలి. లభ్యమయిన గంగా జలము ఉత్తమము. తర్వాత ఉంగరమును మంత్రోచ్చారణ, ధూపదీపములతో పూజను నిర్వహించి ఆగ్రహమునకు సంబంధించిన మంత్రము 108 సార్లు జపించాలి.

## రవికి గల మంత్రం :-

ఓం ఘృణిః సూర్యాయనమః

కెంపు యితర రత్నములతో వజ్రము, నీలము, గోమేధికము, వైఢూర్యములతో కలిపి ధరించరాదు.

## ముత్యము ఎవరు ధరించాలి :-

చంద్రునికి ముత్యముపై ఆధిపత్యము. చంద్రుడు శుభస్థానాధిపతి యైన శుభస్థానాధి పత్యము పట్టి, వేధ పొందినా ముత్యము ధరించుట వలన లాభదాయకము.

## ముత్యము ధరించువారు :-

మేషలగ్నమునకు చంద్రుడు చతుర్థాధిపతి. మేషలగ్నాధిపతి కుజునకు మిత్రుడు. ఈ లగ్న జాతకులు ముత్యము ధరించుట వలన మానసిక రుగ్మతలు, తల్లి వలన సుఖ సంతోషములు పొందగలరు. విద్యావిషయములలో విజయము సిద్ధింపగలదు అంతేగాక భూలాభము, గృహలాభము కలుగును. ఈ ఫలితములు చంద్ర మహాదశ, అంతర్భాగాలలో గాంచగలము. అంతేకాక పగడము కలిపి ధరించిన విశేష ప్రయోజనము సిద్ధింపగలదు. వృషభలగ్నమునకు చంద్రుడు తృతీయాధిపతి. ఈ లగ్న జాతకులు ముత్యము ధరింపరాదు. కానీ చంద్రుడు తన స్వస్థానమయిన కర్కాటకమున వున్నప్పుడు ముత్యము ధరింపవచ్చును.

చంద్ర మహాదశలో ముత్యము మంచి యోగము కలగజేయును.

మిధున లగ్నమునకు చంద్రుడు ద్వితీయాధిపతి. ధనస్థానాదిపతి. ఇది మారక స్థానము. చంద్రుడు మారకము కలగజేయుటలో పూర్తి బలవంతుడు. చంద్రుడు వేధను పొంది శుభస్థానము (లేక) పాపియైన అవయోగము లిచ్చుచు, ధనము హరించునప్పుడు ముత్యము ధరించిన కొంతమేర ఉపశమనము కలుగును. ఏది ఏమైనప్పటికినీ ముత్యము మిధునలగ్నమునకు అంతప్రయోజనకారి కాదు. ద్వితీయాధిపతి చంద్రుడు 12వ స్థానములో ఉచ్ఛలో వున్ననూ, తన స్వస్థానములో వున్న 9,10,11 స్థానాములందు వున్న ముత్యము ధరించుట లాభదాయకము. చంద్రమహాదశయందు ఏమైనప్పటికినీ మిధునలగ్నమునకు ముత్యము

అనుకూలము కాదు. ఎందువలనంటే మిధునలగ్నాధిపతి బుధుడు, చంద్రునికి గల మిత్రత్వము లేనందువలన.

కర్కాటక లగ్నమునకు చంద్రుడు అధిపతి. ఈ లగ్నజాతకమునకు ముత్యము యోగదాయకము. వారు జీవిత పర్యంతము ధరింపవచ్చును. ముత్యము ధరించుటవలన మంచి ఆరోగ్యము, దీర్ఘాయువు కలుగును. ముత్యము ధరించిన జీవితము సాఫీగా ఉండగలదు. మానసిక వత్తిడి తగ్గి, అర్థికాభివృద్ధిని కలగజేయును.

సింహాలగ్నమునకు చంద్రుడు వ్యయాధిపతి. అందువలన ఈ లగ్నజాతకులు ముత్యము ధరింపరాదు. చంద్రుడు స్వస్థానమయిన 12వ యింటిలో ఉన్నప్పుడు, చంద్రమహాదశ యందు ముత్యము ధరింపవచ్చును.

కన్యాలగ్నమునకు చంద్రుడు ఏకాదశాధిపతి. అనగా లాభాధిపతి. కోరికలను నఫలీకృతము చేయును. ధనము నంపాదించుటకు, పేరు ప్రతిష్టలు పెంపొందించుటకు. నంతానము పొందుటకు, ముత్యము ధరించిన సఫలీకృతమగును. చంద్రుడు 9 వ స్థానమున వృషభములో ఉన్నప్పుడు ముత్యము ధరింపవచ్చును. అందువలన వృత్తియందు విజయము, మనశ్శాంతి, ధనము, సంపాదన, వాహనములను పొందుట అను ఫలితములు పొందగలరు. జాతకమున చంద్రుడు ఎక్కడైనా బాధింపబడిన ముత్యము ధరించిన చెడు ప్రభావములు నశింపగలవు.

తులా లగ్నమునకు చంద్రుడు దశమాధిపతి. అయినా చంద్రుడు తులాలగ్నాధిపతియైన శుక్రునకు మిత్రుడు కాదు. చంద్రుడు దశమస్థానములో న్వస్థానములో ఉన్నప్పుడు ముత్యము ధరించుట వలన పేరు ప్రఖ్యాతులు, గౌరవము, జీవితములో ముందంజ వేయుట, సంపదలు కలుగును. అంతేకాక దశమాధిపతి దశమమునందున్న అది రాజయోగమని చెప్పబడింది. చంద్రమహాదశ యందు ముత్యము ధరించిన ఫలితములు రెట్టింపగును. చంద్రుడు శుభస్థానమున (లేక) బాధింపబడుచున్నను, చెడు ఫలితములు కలుగుచున్నను, అటువంటి చెడు ఫలితములు ముత్యము ధరించుట వలన పోగొట్టుకోవచ్చును. ముత్యము ధరించిన మనస్సునకు స్థిరత్వము కలుగును.

వృశ్చిక లగ్నమునకు చంద్రుడు నవమాధిపతి. భాగ్యస్థానము. పితృస్థానము కూడ. అందుచే ముత్యము ధరించుట వలన శుభ పలితములు కలుగును. స్వచ్ఛమయిన మనస్సు, మతపరమయిన ధర్మకార్యములందు ఆసక్తి కలిగించును. అదృష్టమును కలగజేయును. చంద్రుడు బాధింపబడు స్థితిలో వున్నను ముత్యము ధరించుట శ్రేయస్కరము. ఎఱ్ఱని పగడముతో కలిపి ముత్యము ధరించుట వలన వృశ్చికలగ్న జాతకులకు అపరిమితముగా శుభములు కలుగును.

ధనుర్‌లగ్న జాతకులకు చంద్రుడు అష్టమాధిపతి. చంద్రుడు తన స్వస్థానము 8 ఇంట వున్నప్పుడు ముత్యము ధరింపవలయును. (లేక) అష్టమాధిపత్యము వలన

ముత్యము ధరింపకుండుటయు మంచిదే. కనక పుష్యరాగము కలిపి ధరించిన ఏవిధమయిన చెడు ప్రభావము చూపక మంచి ఫలితములు కలుగును. కనకపుష్యరాగము గురువు యొక్క రత్నము ధనుర్ లగ్నమునకు అధిపతి. చంద్రునికి మిత్రత్వము కలదు.

మకర లగ్నమునకు చంద్రుడు సప్తమాధిపతి. మారక స్థానము. చంద్రుడు మకరలగ్నాధిపైన శనికి శత్రువు. అందుచే ముత్యము ధరింపరాదు. చంద్ర మహాదశలో ముత్యము ధరింపవచ్చును. చంద్రుడు తన స్వస్థానమయిన కర్కాటక రాశి యందు వున్నప్పుడు మాత్రమే ముత్యము ధరించాలి. కుంభ లగ్నమునకు చంద్రుడు షష్ఠాధిపతి. అది అశుభ స్థానము. కుంభ లగ్నజాతకులు ముత్యము ధరింపరాదు. చంద్రుడు తన స్వస్థానమయిన కర్కాటకము నందు ఆరవ ఇంట వున్నప్పుడు మాత్రమే ముత్యము ధరించాలి. వేధకు గురి కాబడిన చంద్రుడు, పాప స్థానగతుడయిన చంద్రుడు వున్నప్పుడు మాత్రమే ముత్యమును ధరించిన శత్రువులు నశింపగలరు. ఋణ బాధలు సమసిపోగలవు.

మీన లగ్నమునకు చంద్రుడు పంచమాధిపతి. ఇది చాలా శుభ స్థానమని చెప్పవలెను. ముత్యము ధరించుట వలన జాతకుడు మంచి సంతానము పొందును. పేరు ప్రఖ్యాతులు కలుగును. అదృష్టము త్వరితముగ కలిసి వచ్చును. పంచమస్థానము, తొమ్మిదవ స్థానమగుటవలన భాగ్యస్థానముగా గుర్తించబడును. చంద్రుడు స్వస్థానములో వున్నప్పుడు ముత్యము ఎల్లప్పుడు ధరించాలి. అందువలన అది మంచి ప్రయోజనములను కలిగించును. దీని శుభపరిణామములు చంద్ర దశాంతర్దశలందు ఎక్కువగా వుండును. చంద్రుడు పాప స్థానగతుడయినా వేధలుండినా ముత్యము తప్పని సరిగా ధరించాలి. మీన లగ్నాధిపతి గురువు చంద్రునికి మిత్రుడు.

2, 4, 6 గానీ 11 క్యారెట్లు కలిగిన ముత్యము ధరించాలి. వెండితో తయారుచేయించుకుని సోమ, గురువాములలో మిగిలిన కార్యక్రమములు సజావుగా జరిపించి, శుక్లపక్షములో ఈ క్రింది ఇవ్వబడిన మంత్రము 108 సార్లు జపము చేసి సోమవారం ఉదయమునే ధరించాలి.

మంత్రము:- ఓం సోం సోమాయనమః

ఈ ముత్యమును వజ్రము, పచ్చ, నీలము, గోమేధికము, వైఢూర్యములతో కలిపి ధరించరాదు.

## ఎవరు ఎట్టి పగడమును ధరించాలి :-

పగడము కుజుని ఆధిపత్యము గలది. ఎవరి జాతకములో కుజుడు శుభస్థానగతుడయి వుండునో వారు మాత్రమే పగడము ధరించాలి. జాతకములో కుజుడు పాపస్థానమున వున్న అట్టి జాతకులు పగడము ధరించుట మంచిది కాదు.

## పగడము ధరించువారు :-

మేషలగ్న జాతకులకు కుజుడు లగ్నాధిపతి. జీవిత పర్యంతము ఈ జాతకుడు పగడము ధరించ వచ్చును. పగడము మంచి ఆరోగ్యమును, ధైర్యము, దీర్ఘాయువు, పేరు ప్రఖ్యాతులు, సుఖము కలుగును. జాతకునికి కుజుడు పాపస్థానమున వున్న ఈ పగడము చెడు ప్రభావములను కలగజేయును.

వృషభలగ్న జాతకులకు, కుజుడు వ్యయాధిపతి మరియు సప్తమాధిపతి. అందువల్ల వృషభలగ్న జాతకులు పగడము ధరింపరాదు. ఏది ఏమైనా కుజుడు స్వస్థానములయిన 12, 7 స్థానములలో వున్నప్పుడు పగడము ధరింపవచ్చును. అది కూడ కుజ దోషము వున్నపుడు మాత్రమేనని గ్రహించవలయును.

మిథున లగ్నమునకు కుజుడు షష్ఠమ, లాభాధిపతి. మిథునలగ్నమునకు కుజుడు ఉపకారి కాదు. పాపి. అందుచే ఈ లగ్న జాతకులు పగడము ధరించరాదు. కుజుడు 6, 11 స్థానములలో వున్నపుడు, మిథునలగ్నజాతకులు, కుజమహర్దశయందు పగడము ధరింపవచ్చును. మిథున లగ్నాధిపతి బుధుడు కుజునికి శత్రువు.

కర్కాటక లగ్నమునకు కుజుడు పంచమ, దశాధిపతి. పంచమము త్రికోణము. దశమము కేంద్రము. ఇది చాలా జయకరమయినది. యోగకారకమయిన గ్రహము. వీరు పగడము ఎల్ల వేళలయందు ధరించుటవలన పుత్రలాభము, బుద్ధికుశలత, అదృష్టము, సంపద, పేరు ప్రఖ్యాతులను, గౌరవమును, విజయమును, వృత్తియందు అభివృద్ధి కలుగును. కర్కాటక లగ్నాధిపతి చంద్రుని రత్నము ముత్యముతో కలిపి పగడము ధరించిన యెడల, ఫలితము ఇంకనూ లాభదాయకముగా వుంటుంది. కుజ మహాదశయందు ఈ ఫలితములు ప్రస్ఫుటముగా కనిపించగలవు.

సింహలగ్నమునకు కుజుడు చతుర్థ నవమాధిపతి. 4 కేంద్రము, 9 త్రికోణము. కావున, శుభము, యోగకారకమయిన గ్రహము. కావున పగడము ధరించుట వలన కర్కాటక లగ్నానికిచ్చిన శుభ ఫలితములు నివ్వగలదు. అవి గాక, ఈ లగ్న జాతకులకు భూమి, ఆస్తి ప్రాప్తించగలవు. సంపదల నివ్వగలదు. నీతివంతునికి సద్గుణవంతులుగా చేయును. తండ్రి యొక్క ఆయుష్షు పెరుగును. కుజుడు 4, 9 స్థానములలో వున్న యెడల లాభకరమయిన, అనుకూల ఫలితములు కలగగలవు. కెంపుతో కూడిన పగడము ధరించిన రవి, కుజులు మిత్రులు అయినందువలన ఫలితము త్వరగా కలుగగలవు.

కన్యాలగ్న జాతకులకు కుజుడు తృతీయ అష్టమాధిపతి. అందువలన కన్యాలగ్నమునకు కుజుడు పాపి. అయినందువలన కన్యా లగ్నజాతకులు పగడము ధరించరాదు. కుజమహాదశయందు తప్పని పరిస్థితులలో ధరించవలసి వచ్చిన ఎఱ్ఱటి పగడము ధరించాలి. అదీ గాక కుజుడు 3, 8 స్థానములలో వున్నప్పుడు మాత్రమే ధరించాలి.

తులా లగ్న జాతకులకి కుజుడు ద్వితీయ, సప్తమాధిపతి. 2, 7 స్థానములు రెండునూ మరణమును నిర్దేశించునవే. అంతే గాక తులారాశికి లగ్నాధిపతి శుక్రునికి, కుజుడు శత్రువు. పగడము ధరించుట ఈ లగ్న జాతకులకు మంచిది కాదు. రెండవ స్థానము భాగ్యమునకు సంబంధించినది కూడ అయినందునవలన కుజునకు స్వస్థానమయిన 2 వ యింట నున్న యెడల పగడము కుజ దశయందు ధరింపవచ్చును. అందువలన అనుకూల సమయములో అది శక్తి వంతమయిన పంచమహా పురుషయోగము. దానినే రుచక యోగము అని పేర్కొంటారు. రుచక యోగములో జన్మించినవారికి బలిష్టమగు శరీరముండును. కీర్తి కలిగి వుంటారు. పురాతన శాస్త్రములందు పాండిత్యము కలిగి కీర్తి వంతుడగును. ఎర్రటి శరీర ఛాయ కలిగి ఆకర్షణీయమయిన శరీరము కలిగి వుండును. దానశీలత, దీర్ఘాయువు, ధనము కలిగి వుంటారు. సైన్యమునకు ఆధిపత్యము వహించువాడై వుండగలడు. ఈ విధమయిన జాతకము గల జాతకునికి జాతకమున రుచక యోగము కలిగిన పగడము ధరించిన మిక్కిలి ప్రయోజనముగా వుండగలదు. ముఖ్యముగా కుజమహాదశ, అంతర్దశలలో బాగా అనుకూలముగా వుండగలదు.

వృశ్చికలగ్న జాతకులకు కుజుడు లగ్న, షష్ఠమాధిపతి. 6 స్థానమున కన్నను, లగ్నాధిపత్యము పైనే ఎక్కువ అధికారయుతముగా వుండగలదు. అందుచే పగడము ధరించిన ఆ జాతకునికి అనేక శుభములు కలుగ గలవు. మేష లగ్నమునకు మాదిరిగనే ఫలితము లుండగలవు.

ధనుర్లగ్న జాతకులకు కుజుడు పంచమము. వ్యయాధిపతి. పంచమస్థానము, త్రికోణము. 12 వ స్థానముకన్నా ఎక్కువ అధికారము కలిగియుండును. పగడము ధరించుట వలన ధనుర్లగ్న జాతకులు శుభసంతానము, పేరు ప్రతిష్టలను కలిగి యుందురు. ధనుర్లగ్నాధిపతి గురువు, కుజుడు మిత్రులు.

మకర లగ్నమునకు కుజుడు చతుర్థ, ఏకాదశాధిపతి. చతుర్థము కేంద్రము. కుజమహాదశయందు పగడము ధరించుట వలన జాతకుడు భూములను, ఆస్తులను, వాహనములను, గృహసౌఖ్యములు, తల్లి వలన సుఖ సంతోషములు, భాగ్యమును పొందగలరు. మకర లగ్నాధిపతి శని కుజునకు శత్రువు.

కుంభలగ్నమునకు కుజుడు తృతీయ, దశమాధిపతి. పగడమును కుజ మహాదశయందు ధరించిన వృత్తి యందు విజయము, అభివృద్ధి గాంచగలడు. కుజుడు స్వస్థానమయిన 10వ ఇంటిలో వున్న ఆధిక్యత కలిగి, రుచక యోగము కలుగును. కనుక జాతకుడు పగడము ధరించుట వలన అన్ని విధాల బాగుంటుంది.

మీన లగ్నమునకు కుజుడు ద్వితీయ, నవమాధిపతి. 9వ స్థానము భాగ్యస్థానము మరియు పితృస్థానము. ద్వితీయము ధనము, కుటుంబము, మారకము. మీన లగ్నమునకు కుజుడు శుభుడు. అందువలన పగడము ధరించిన జీవితములో అనేక విజయములు సాధించగలరు. జీవితము సుఖ సౌఖ్యములతో

ఆనందముగా గడపగలరు. జాతక చక్రములో కుజుడు ఏవిధమయిన చెడు స్థితి కలిగి వున్నా తప్పనిసరిగా పగడము ధరించాలి. అంతేకాక కనక పుష్యరాగము, పగడము ధరించిన అత్యంత యోగదాయకము. అనేక విధములుగా కలిసి వచ్చి జీవితము ఆనందమయముగా సాగిపోగలదు.

రాగి కలిసిన బంగారు ఉంగరములో పగడము పొదిగించి ఉంగరపు వ్రేలికి ధరించాలి. 6 క్యారెట్లకి తగ్గకుండా పగడము వుండాలి. మంగళవారము రోజున చేయించి జపము 108 సార్లు చేసి సూర్యోదయము తర్వాత మంగళవారమునాడే శుక్లపక్షమున ధరింపవలయును.

మంత్రము : ఓం అం అంగారకాయనమః

పచ్చ, వజ్రము, నీలము, గోమేధికము, వైఢూర్యములను పగడముతో కలపరాదు.

## పచ్చ ఎవరు ధరించాలి :-

పచ్చకు ఆధిపత్య గ్రహము బుధుడు. బుధునికి కన్య, మిధునము స్వస్థానములు. పచ్చ యోగదాయకమయినది. ఎవరి జాతక చక్రములో బుధుడు శుభస్థానములో వున్న వారికి యోగదాయకముగ వుండును. బుధుడు జాతకములో ఏదో విధముగా పాపియైన పచ్చను ధరించుట వలన, చెడు ఫలితములు చేయక తటస్థముగా వుండును గానీ (లేక) కొంతమేర మంచికి తోర్పాటునివ్వటం గానీ జరుగును.

## పచ్చ ధరించువారు :-

మేషలగ్నమునకు బుధుడు తృతీయ, షష్ఠమాధిపతి. ఈ రెండు స్థానములు చెడు స్థానములు. అందుచేత మేషలగ్నజాతకులకు పచ్చ నరిపడదు. 3, 6 స్థానములలో న్వస్థానములో బుధుడు వున్నప్పుడు గానీ, బుధ మహాదశ జరుగుతున్నపుడు పచ్చను ధరించిన కొంతమేర ఉపశమనము కలుగును. మేష లగ్నాధిపతి కుజుడు, బుధునికి శత్రువు. వృషభలగ్నమునకు బుధుడు ద్వితీయ, పంచమాధిపతి. ద్వితీయము ధన, మారక స్థానము. పంచమము కోణ, మనోస్థానము. అందుచేత వృషభలగ్నమునకు బుధుడు శుభుడు. ఈ జాతకుడు ఎప్పుడైనా అనుకూలము కొరకు పచ్చను ధరించాలి. ఇది భాగ్యమును, సంతానము నివ్వగలదు. బుద్ధికుశలత, అదృష్టము, భాగ్యము నివ్వగలదు. బుధమహాదశ, అంతర్దశలందు ఈ ఫలితములు ఎక్కువగా వుంటాయి. వజ్రముతో కలిపి పచ్చను ధరించుట వలన ఫలితములు ఎక్కువగా వుండే అవకాశముంది. లగ్నాధిపతి శుక్రుడు బుధునికి మిత్రుడు.

మిధున లగ్నమునకు బుధుడు ఆధిపత్యము వహించుచున్నాడు. లగ్న చతుర్థాధిపతి, రెండు కేంద్రములే. రక్షకతాయెత్తుగ, ఈ లగ్న జాతకులు ఎల్లప్పుడు పచ్చను ధరించాలి. ఇది వారికి సంపూర్ణ ఆరోగ్యము, సౌభాగ్యము, ఆయుష్షు

భూములు, ఆస్తులను కలగజేయును. కుటుంబశ్రేయస్సును కాపాడగలదు. విద్యలో విజయముగాంచగలరు. ఒడిదుడుకులులేక సుఖముగా ఆనందముగా జీవితము గడుపగలరు. ఎక్కువగా లాభకరమయిన ఫలితములు బుధమహాదశలోను, అంతర్ధశలలోను కలుగును. బుధుడు స్వస్థానము లగ్నమునందు కానీ, నాల్గవ స్థానమందుగానీ, వున్న అనుకూల భద్రయోగము కలగజేయును. (ఇది పంచ మహాపురుష యోగములలో ఒకటిగా పేర్కొన్నారు) ఆ సమయంలో పచ్చను ధరించుట వలనఈ యోగము యొక్క ఫలితములు ఎక్కువగా వుంటాయి.

కర్కాటక లగ్నమునకు బుధుడు తృతీయ వ్యయాధిపతి. రెండు స్థానములు అనుభ స్థానములే. అందుచేత కర్కాటక జాతకులు పచ్చను ధరించరాదు. లగ్నాధిపతి చంద్రునకు బుధుడు శత్రువు. ఏది ఏమైనప్పటికీ బుధుడు, 3, 12 స్థానములలో వున్నపుడు అది కూడా బుధ మహాదశలో మాత్రమే పచ్చను ధరించాలి.

సింహలగ్నమునకు బుధుడు, ద్వితీయ, ఏకాదశాధిపతి. ద్వితీయము ధనము, మారకము. ఏకాదశము లాభము, కోరికలు నెరవేరే స్థానము. వీరిద్దరి కలయిక వలన, బుధాదిత్య యోగమని చెప్పబడుచున్నది. బుధమహాదశ, అంతర్ధశలలో ఈ జాతకుడు పచ్చని ధరించిన కుటుంబ సభ్యుల మధ్య అన్యోన్యత, విశేషముగ ఆర్థికలాభములు కలుగును. పేరు ప్రతిష్టలు, గౌరవమర్యాదలు కలుగగలవు. ఈ ఫలితములు, 2,11 స్థానములలో వున్నప్పుడు ఎక్కువగా వుండే అవకాశముంది.

కన్యాలగ్న జాతకులకు బుధుడు లగ్నాధిపతి. దశమాధిపతి. కన్యాలగ్నము బుధునికి ఉచ్ఛ గల స్థానము. 1,10 స్థానములు కేంద్రములు. పచ్చను ధరించిన కన్యాలగ్న జాతకులకు అది రక్షకతాయెత్తుగ పని చేయగలదు. అంతేగాక మంచి ఆరోగ్యమును, ఆయుష్షు, వృత్తి యందు అభివృద్ధి, పేరు ప్రతిష్టలు, గౌరవ మర్యాదలు యినుమడింపగలవు. జాతక చక్రమున బుధుడు శత్రు స్థానమున వున్నా లేక వేధను పొందినా పచ్చ ధరించిన అటువంటి చెడు పరిణామములు తటస్థముగ వుండగలవు.

తులా లగ్న జాతకులకు బుధుడు నవమ, వ్యయాధిపతి. 9వ స్థానము త్రికోణము అయినందు వలన శుభకరమయినది. అది భాగ్యస్థానము, పితృ స్థానము. బుధ మహా ధశలో అంతర్ధశలో పచ్చను ధరించిన శుభములు కలుగును. తులా లగ్నాధిపతి శుక్రుడు బుధునికి మిత్రుడు. అందుచేత వజ్రములో కలిపి పచ్చను ధరించిన జాతకులకు యోగదాయకముగ వుంటుంది.

వృశ్చిక లగ్న జాతకులకు బుధుడు అష్టమ లాభాధిపతి. కావున బుధుడు ఈ లగ్నమునకు శుభుడు కాదు. లాభాధిపతి అయిన బుధుడు లగ్నములో 2, 4, 5, 9,

10, 11 స్థానములలో వున్నపుడు మాత్రమే పచ్చను ధరించుట వలననూ, బుధ మహాదశ అంతర్దశలయందు, జాతకుడు ధనసంపాదన, ఆర్థికలాభములు, వృత్తిలో, వ్యాపారములో లాభములను కలగజేయును.

ధనుర్లగ్నజాతకులకు బుధుడు సప్తమ, దశమాధిపతి. దీనివలన బుధుడు కేంద్ర ఆధిపత్యదోషము. ద్వికేంద్రాధి పత్యము పట్టిన నైసర్గిక శుభుడు. అయినా బుధుడు లగ్నములో కానీ, 2, 4, 5, 7 స్వస్థానము 9, 10, 11 లలో వున్నయెడల బుధ మహర్దశ యందు పచ్చను ధరించుట వలన లాభదాయకము. శుభకరము. దశమాధిపతి అయిన బుధుడు 6, 18, 12 స్థానములలో వున్న యెడల ఈ జాతకుడు ఉద్యోగపరమయిన చిక్కులను ఎదుర్కొవలసి రావచ్చును. ఈ సమయములో పచ్చ ధరించిన ఆ బాధలను అధిగమించవచ్చును. సప్తమాధిపతిగా బుధుడు శుభ స్థానములో లేనప్పుడు కనకపుష్యరాగమును పచ్చకి బదులుగా ధరించవలయును. అందుచేత సంసార జీవితములో కలతలు, సమస్యలు, సర్దుబాటు కాగల అవకాశముంది. స్త్రీలకు కనకపుష్యరాగము చాలా ప్రాముఖ్యము గలది. స్త్రీల జాతకములో గురువు భర్తకు కారకుడు.

మకరలగ్న జాతకులకు బుధుడు షష్టమ, నవమాధిపతి, 9వ స్థానములో కోశాధికారియైన బుధుడు యోగములను కలగజేయును. అంతేకాక మకరలగ్నాధిపతి శనికి బుధుడు మిత్రుడు. ఈ లగ్నము వారు పచ్చ ధరించిన అనేక శుభములు కలుగును. బుధ మహాదశయందు, అంతర్దశల యందు పచ్చను ధరింపవచ్చును. లగ్నాధిపతికి బుధునికి మిత్రత్వముండుట వలన నీలము కూడా జాతకుడు ధరింపవచ్చును. అందువలన విశేషలాభములు కలుగును.

కుంభలగ్నమునకు బుధుడు పంచమ, అష్టమాధిపతి. పంచమకోశాధి పత్యము బుధునికి కలిగినందువలన ఈ లగ్నమునకు శుభుడు. లగ్నాధిపతి శనికి మిత్రత్వముందుట వలన పచ్చతో పాటు నీలము ధరించిన జాతకునికి బుధ దశలోనూ, అంతర్దశలలోను విశేషఫలితములు కలుగును. మీన లగ్నమునకు బుధుడు చతుర్ధ, సప్తమాధిపతి. బుధుడు రెండు కేంద్రములకు అధిపతి. ద్వికేంద్రము వలన దోషత్వము గలదు. అయినప్పటికి బుధుని స్వస్థానములైన 4, 7 స్థానములందుగానీ, 2, 5, 9, 10, 11 స్థానములందుగానీ పచ్చను ధరింపవచ్చును. అందువలన బుధ మహర్దశలోగానీ, అంతర్దశలలోగానీ ప్రయోజనము చేకూరగలదు. సప్తమాధిపత్యము పట్టిన బుధుడు గుర్తించనచో వయసు మీరిన వారు పెరిగి జాతకునికి ఆయుష్షునకు ప్రమాదము కలిగే అవకాశములు ఎక్కువ. పచ్చతో పాటు నీలము ధరించిన కొంత మేర బాధల నుండి ఉపశమనము కలిగే అవకాశముంది. నీలము శని ఆధిపత్యము. మీనలగ్నమునకు ఏకాదశ, వ్యయాధిపతి. అయిన శని కూడా రక్షణ యివ్వటం సాధ్యం కాకపోవచ్చును. అందువలన పచ్చ ధరింపరాదు.

మంత్రం : ఓం భుం బుధాయనమః

ఈ పచ్చని పగడము, ముత్యము, కనకపుష్యరాగములలో జత చేసి ధరించరాదు.

## ఎవరు పుష్యరాగము, కనకపుష్యరాగము ధరించాలి :-

దేవగురువైన బృహస్పతి (గురువు) ఆధిపత్యము గల రత్నము. కనకపుష్యరాగము. పుష్యరాగమును గూర్చి అనేక విభిన్న అభిప్రాయములు గలవు. గురువునకు పుష్యరాగము మంచిదా (లేక) కనకపుష్యరాగము మంచి కలుగజేస్తుందా అనే అభిప్రాయము కలుగుతుంది.

జ్యోతిషశాస్త్రవేత్తలు, అనుభవజ్ఞుల ప్రకారము కనకపుష్యరాగమునే నిర్ణయించటం జరిగింది. గురువు యొక్క రంగు పసుపు పచ్చ అయినందువలన పసుపురంగు కలిగిన పుష్యరాగమునే గురువుకి వర్తించగలదని అనేక మంది అభిప్రాయము.

ఎవరి జాతకములో గానీ గురువు సామాన్యస్థితిలో వుండి గానీ, ఏకొంచెము వేధకి గురికాబడిన పుష్యరాగము తెలుపు రంగుది ధరింపవచ్చును. గురువు శత్రు స్థానమునగానీ, కేంద్ర వేధలు పొందినప్పుడుగానీ, పాప స్థానములందుగానీ వున్నయెడల అత్యంత శక్తివంతముగల కనక పుష్యరాగము ధరించవలయును. అట్లు ధరించిన అనేక శుభపరిణామములు పొందటానికి అవకాశములు ఎక్కువగా వుండగలవు. కనకపుష్యరాగము జాతక చక్రములో గురువు శుభస్థానములో వున్నపుడు ధరించిన అనేక మంచి ఫలితములు కలుగును. షష్ఠ, అష్ట, ద్వాదశ స్థానము లందున్న పుష్యరాగము ధరింపరాదు.

## పుష్యరాగము, కనకపుష్యరాగము ధరించువారు :-

మేషలగ్న జాతకులకు గురువు, నవము, ద్వాదశాధిపతి, కోణాధిపతి అయినందువలన గురువు శుభగ్రహము. మేషలగ్న జాతకులు కనకపుష్యరాగము ధరించుటవలన అధికముగా తెలివితేటలు, దాతృత్వము మతపరమయిన అవగాహన, పెద్దల యెడ గౌరవమర్యాదలు పాటించుట లాంటి గుణములు అలవడును. ఈ ఫలితములు గురుమహాదశ, అంతర్దశలందు పూర్తిగా వుండగలవు. గురువు 4 స్థానమున కర్కాటకము ఉచ్ఛయందు వున్ననూ, పంచమహాపురుషయోగములలోని హంసయోగమేర్పడగలదు. ఈ హంస యోగము వలన జాతకుడు కనకపుష్యరాగము ధరించుట వలన వూహింపనలవి కాని అత్యుత్తమ స్థాయి కలిగే అవకాశముంది. గురువు ఏదైనా పాపస్థానములందున్ననూ, పాపగతుడయినా, కేంద్రవేధలు కలిగిననూ, కనకపుష్యరాగము ధరించిన జాతకుడు గురువు కలగజేయు బాధల నుండి రక్షణ లభించే అవకాశముంది.

వృషభలగ్న జాతకులకు గురువు అష్టమ, ఏకాదశాధిపతి. అంతేకాక వృషభలగ్న అధిపతి శుక్రునికి శత్రువు. అందుచేత ఈ లగ్నమునకు గురువు శుభుడు కాదు. అయినా ఏకాదశాధిపతియైన గురువు లగ్నములో గానీ ద్వితీయ, చతుర్థ, పంచమ, నవమ, దశమ లేక తన స్వస్థానము అయిన ఏకాదశమునందుడిన ఈ జాతకునికి ధనలాభము కలుగును. ఇది గురు మహాదశలో కనకపుష్య రాగము ధరించినందు వలన కలిగే ఫలితము.

మిధున లగ్నమునకు గురువు సప్తమ, గురువు లగ్నమున, ద్వితీయ, చతుర్థ, పంచమ, సప్తమ స్వస్థానము, హంస యోగమునకు కారకుడు. అంతేగాక ఏకాదశ స్థానమున ఉన్న ఈ జాతకునికి కనకపుష్యరాగము ధరించుట వలన లాభదాయకము. మిధున లగ్నమునకు ద్వితీయము కర్కాటకము గురువుకి ఉచ్ఛ అవును. జాతకుడు ఉద్యోగములో కష్టనష్టములు గురికాబడిన దశలందు సంబంధము లేకనే పుష్యరాగము ధరించిన అతని ఉద్యోగమునందు కలుగు కష్టనష్టములు సమసి పోగలవు. వయసుపైబడిన వారు, దీర్ఘకాలము రోగములతో బాధలననుభవించువారు జాతకమయిన అల్పాయువు గలవారు కనకపుష్యరాగము ధరింపరాదు. మిధున లగ్నమునకు సప్తమాధిపతి గురువు విపరీత మారక గుణములు కలిగియుండును.

కర్కాటక లగ్నమునకు గురువు షష్ఠమ, నవమాధిపతి. 9వ స్థానము కోణాధిపత్యము కలిగి నందువలన గురువు శుభగ్రహము. అంతే గాక కర్కాటకము గురువునకు ఉచ్ఛరాశి. అందుచేత గురు మహాదశలో కనకపుష్యరాగము ధరించుట వలన జాతకునికి సద్గుణవంతులయిన పుత్రులు, ఉన్నతవిద్య, ధార్మిక మత సంబంధమయిన విషయములలోను, సంపదయు, అదృష్టము కలుగును. ఈ లక్షణములన్నియు గురుమహాదశ, అంతర్దశలలో జరుగును.

గురువు లగ్నములో వుండి ఉచ్ఛను కలిగి యుండుట, నవమము స్వస్థానము, ఇలాంటి స్థితులు కొన్ని రాజయోగములకు కారణము కాగలదు. అటువంటి పరిస్థితులలో కనకపుష్యరాగము ధరించిన అనేక శుభపరిణామములు సంభవింపగలవు. కనకపుష్యరాగముతో పాటు ముత్యముగానీ, పగడము గానీ కలిపి ధరించిన ఈ లగ్న జాతకులకు ఎక్కువగా అనుకూల ఫలితములు కలిగే అవకాశముంది. పగడము కుజునకు, కర్కాటక లగ్నమునకు కుజుడు యోగకారకుడు. ముత్యము లగ్నాధిపతికి ఆధిపత్యరత్నము. గురువునకు ఇద్దరునూ మిత్రులే.

సింహలగ్న జాతకులకు గురువు పంచమ, అష్టమాధిపతి. పంచమము కోణాధిపత్యము వలన గురువు సింహలగ్నమునకు శుభుడు. కనక ఈ లగ్న జాతకులు కనకపుష్యరాగము ధరించుటవలన అనేక లాభములు కలుగును. ఈ ఫలితములు గురుమహాదశ, అంతర్దశలలో పొందగలరు. రవి సింహలగ్నాధిపతి ఆధిపత్యము గల కెంపునూ, కనకపుష్యరాగమును కలిపి ధరించిన అనేక లాభములు కలుగును.

కన్యాలగ్నజాతకులకు గురువు చతుర్థ, సప్తమాధిపతి. ద్వికేంద్రాధిపత్యము వలన కేంద్రాధిపత్య దోషము. అయినా కూడా గురువు లగ్నమున ద్వితీయము, సప్తమము (తన యొక్క స్వస్థానము హంసయోగము) పంచమము, నవమము, దశమము, ఏకాదశ స్థానములందున్న గురుమహాదశ, అంతర్దశలందు కనకపుష్యరాగము ధరించిన అనేక శుభఫలితములు కలిగే అవకాశముంది. ఈ గురువు కన్యాలగ్నమునకు సప్తమాధిపతి అయినా, మారకుడైనందునవలన వయసుపైబడినవారు, దీర్ఘకాలముగా రోగముల బారిన పడినవారు, జాతకములో అల్పఆయుర్దాయము గలవారు, కనకపుష్యరాగము ధరింపరాదు. విద్య విషయంలో ఆటంకములు గలవారూ, ఆస్థివిషయ తగువులు గలవారూ, అనేక కష్టనష్టములు గలవారూ, కనకపుష్యరాగము ధరించిన ఆటంకములు, తగువులు, కష్టనష్టములు తొలగిపోయి ప్రశాంతజీవనము గడపగలరు.

తులా లగ్న జాతకులకు గురువు తృతీయ, షష్ఠమాధిపతి. శుక్రునకు గురువు శత్రువు. ఈ జాతకులు కనకపుష్యరాగము ధరింపరాదు. గురువు ఈ లగ్నమునకు శుభుడు కాదు. గురువు తన స్వస్థానములైన తృతీయ షష్ఠమములో వున్నపుడు, గురుమహాదశ జరుగుచున్నపుడు అవసరమయిన ధరింపవచ్చును. కొందరి అభిప్రాయము ప్రకారము గురువు తులా లగ్నమునకు శుభుడు కాదు.

ఇంకో విధముగా తులాలగ్న జాతకులకు, శనియోగము నీయగలడు. అలాగే తృతీయ, షష్ఠమాధిపతియైన గురువు కూడా యోగములనీయగల శక్తి గలవాడు.

కానీ, తృతీయ, షష్ఠమ, ఏకాదశాధిపతులు ఏ సమయమునందును పాపులే అని ప్రముఖ జ్యోతిష్య శాస్త్రవేత్తల అభిప్రాయము.

పైవిషయములను బట్టి గురువు తృతీయ, షష్ఠమములో వున్నపుడు స్వస్థానములైనందువలన అవసరమును బట్టి పరిస్థితుల ప్రభావముననుసరించి కనకపుష్యరాగము ధరింపవలెను.

వృశ్చికలగ్నమునకు గురువు ద్వితీయ, పంచమాధిపతి. పంచమాధిపతియు, కోశాధిపత్యము పొందిన గురువు. ఈ లగ్నమునకు లగ్నాధిపతికి మిత్రుడు. అందువలన గురువు వృశ్చికమునకు శుభుడు. అందుచేత కనకపుష్యరాగము, వృశ్చికలగ్నజాతకులకు అనుకూలము గల రత్నము. దీనిని గురుమహాదశ, అంతర్దశలయందు ధరించిన మంచి ఫలితము కలుగజేయును. దీనిని పగడముతో కలిపి ధరించిన విశేష ఫలితములు పొందవచ్చును. ధనుర్లగ్నమునకు గురువు చతుర్థాధిపతి అంటే రెండు కేంద్రములకు అధిపతి. కేంద్రాధిపత్యము దోషమున్నను స్వస్థానములో వున్నపుడు, ఏ వేధలు లేనప్పుడు మంచి కలగజేయగలరు. ఈ లగ్న జాతకులు ఎల్లప్పుడు కనకపుష్యరాగము ధరింపవచ్చును. ఇది రక్షక తాయెత్తువలె పని చేయగలదు. గురుమహాదశ, అంతర్దశలలో ఈ ఫలితము అనుభవింపగలం. రవి

ఆధిపత్యము కలిగిన కెంపు, కనకపుష్యరాగముతో కలిపి ధరించిన విశేషఫలితములు, ఎక్కువ ప్రయోజనకరముగా వుండగలవు. రవి ఈ లగ్నమునకు భాగ్యాధిపతి.

మకర లగ్నమునకు గురువు తృతీయ వ్యయాధిపతి. అందుచేత శుభఫలితములుండవు. ఈ లగ్న జాతకులు కనకపుష్యరాగము ధరించరాదు. గురువు స్వస్థానములైన 3,12 స్థానములందు వున్నపుడు మాత్రమే గాక గురువు యోగకారకుడు కాదని 'ఉత్తర కాలామృతమనే' గ్రంధములో పేర్కొనబడింది. కాని కొందరు ఇది జ్యోతిష్యశాస్త్రవిరుద్ధమని పేర్కొనటం జరిగింది.

కుంభలగ్నమునకు గురువు ద్వితీయ, లాభాదిపతి (2, 11 స్థానములు) లగ్నాధిపతి శని, గురువునకు మిత్రుడు. కాబట్టి కుంభలగ్న జాతకులు కనకపుష్యరాగమును ధరించాలి. గురుమహాదశలోను, అంతర్దశలలోనూ ధరించుట మంచిది. గురువు 2, 11 స్థానములందు వున్నపుడు సంపదలు కలుగుటకు, సంతానముపొందుటకు, కుటుంబమునందు సుఖ సంతోషములను పొందుటకు, ఆరోగ్యమును కాపాడుకొనుటకు, తప్పక కనకపుష్యరాగము ధరించాలి. కుంభలగ్నమునకు ద్వితీయాధిపతియైన గురువు మారకుడగుటవలన ఈ లగ్నజాతకులు వయసుపైబడినవారు, అనారోగ్యము గలవారు, జాతకములో అల్పాయుర్దాయము గలవారు మాత్రమే పుష్యరాగము ధరింపరాదు.

మీనలగ్నమునకు గురువు దశమాధిపతి. కావున ఈ లగ్నమునకు గురువు శుభుడు. అందుచేత కనకపుష్యరాగము ధరించిన లగ్నజాతకుని కోరికలన్నియు సత్వరము నెరవేర్చుకోగలడు. గురువు లగ్నమందుగానీ, దశమమునందుగానీ వున్న అది హంసయోగమని పేర్కొంటారు. అపుడు కనకపుష్యరాగము వలన హంసయోగ ఫలితములు మిక్కుటమగుట జరుగును. గురు దశలో ఈ ఫలితములు ఎక్కువగా కనిపించగలవు. కనకపుష్యరాగము, పగడము కలిపి ధరించుటవలన (కుజునకు సంబంధించు రత్నమయినందువలన భాగ్యాధిపతి కుజుని వలన) ఇంకను మరికొన్ని ఫలితములు కలగగలవు. కనకపుష్యరాగము 3 క్యారెట్లకి తక్కువ కాకుండా వుండాలి. ఇది బంగారముతోనే కలిపి ధరించాలి. సోమవారముగానీ, గురువారము కానీ చేయించి అదే దినమున క్రింది మంత్రము 108 సార్లు జపించాలి. వజ్రము, నీలము, గోమేధము, వైఢూర్యములను కనకపుష్యరాగములను కలపరాదు.

మంత్రం: ఓం బృం బృహస్పతయే నమః

## ఎవరు వజ్రము ధరించాలి :-

శుక్రునికి అధిపత్యము కలిగిన రత్నము వజ్రము. ఎవరి జాతకము నందు శుక్రుడు శుభస్థానములందు కలడో వారే వజ్రమును ధరింపవలెను. శుక్రుడు జాతకములో దుస్థానములలో గానీ, వేధలు గానీ కలిగియున్న వజ్రము ధరించిన అది శుక్రుడివ్వగ దుష్ఫలితములను ఆపివేయును. మంచి చేయకపోయినా చెడు జరగనివ్వదు.

## వజ్రము ఎవరు ధరించాలి :-

మేషలగ్నమునకు శుక్రుడు, ద్వితీయ, సప్తమాధిపతి. ఈ స్థానములు రెండునూ మారకము కలిగించునవే. అంతేకాక మేషలగ్నాధిపతి కుజునకు, శుక్రుడు శత్రువు. అందుచేతనే ఈ లగ్నజాతకులు వజ్రము ధరింపరాదు. శుక్రుడు స్వస్థానములో గానీ, మేషమునకు ద్వాదశమున గానీ, శుక్రునికి ఉచ్ఛ స్థానమయిన మీనములో వున్నపుడు గానీ శుక్రదశయందుగానీ, ఈ లగ్న జాతకులు వజ్రము ధరింపవచ్చును. ఎవరి జాతకములో గానీ తీవ్రయన అనారోగ్యముగానీ, అల్పాయువు సూచింపబడినా వజ్రము ధరింపరాదు. ఆ పరిస్థితులలో లగ్నాధిపతికి సంబంధము గల పగడమునే ధరించాలి.

వృషభలగ్నజాతకులకు శుక్రుడు లగ్న షష్ఠమాధిపతి. కాబట్టి ఈ జాతకులు వజ్రము ధరింపవలెను. వజ్రము ధరించిన ఈ జాతకులకు ఆయుర్వృద్ధి, జీవితములో ఉన్నత స్థానమును పొందగలరు. ఈ వజ్రము శుక్ర దశాంతర్దశలందు ధరించిన మంచి ఫలితములుండగలవు. వజ్రముతో పాటు పచ్చను ధరించిన మిక్కిలి ప్రయోజనకరంగా వుండగలదు.

మిధునలగ్నమునకు శుక్రుడు పంచమ వ్యయాధిపతి. పంచమ కోశాధిపతి కూడా అయినందువలన శుక్రుడు యోగకారి. అంతేగాక శుక్రునికి బుధుడు మిత్రుడు. బుధుడు మిధునలగ్నమునకు అధిపతి. అందుచేత శుక్రమహాదశ, అంతర్దశలందు వజ్రము ధరించుటవలన జాతకునికి మనోవికాసము, పేరు ప్రతిష్టలు కలుగగలవు. వజ్రముతో పాటు పచ్చను కలిపి ధరించిన విశేషఫలితములు పొందుటకు అవకాశములు ఉన్నవి.

కర్కాటక లగ్నమునకు శుక్రుడు చతుర్ధ, ఏకాదశాధిపతి. జ్యోతిష్యశాస్త్ర ప్రకారము శుక్రుడు చతుర్ధ ఏకాదశ స్థానములకు పాపి. అంతేగాక కర్కాటక లగ్నాధిపతి చంద్రుడు శుక్రునికి శత్రువు. అయినా శుక్రుడు చతుర్ధ, ఏకాదశ స్థానములలో వుండిన శుక్రమహాదశ, అంతర్దశలలో వజ్రము ధరించుట వలన శుభఫలితములు కలిగే అవకాశముంది.

సింహలగ్నమునకు శుక్రుడు తృతీయ, దశమాధిపతి. సింహలగ్నమునకు శుక్రుడు శుభగ్రహము. దశమాధిపతి అయిన శుక్రుడు షష్ఠమ, అష్టమ, ద్వాదశలందు వుండిన వజ్రము ధరించిన వృత్తిలో కలిగే ఆటంకములు తొలగి సుఖప్రదముగా వుండును. శుక్రుడు తన స్వస్థానము దశమములో నున్నపుడు రెండు మహాయోగముల నివ్వగలడు. అందులో

అమలయోగములో లగ్నము నుండి గానీ, చంద్రలగ్నము నుండి కానీ, దశమములో నైసర్గిక శుభులున్నందున జాతకుడు అంతులేని కీర్తిప్రతిష్టలు కలగగలవు. అంతే గాక మచ్చలేని నడత గలవానిగా, ఐశ్వర్యవంతమయిన జీవితము గడపగలడు.

మాలవ్యయోగములో చతుర్థమున వున్న అది వాని స్వస్థానము గానీ, ఉచ్ఛ స్థానమయినా మాలవ్యయోగము కలిగి జాతకుడు ధారుఢ్యము గల శరీరము కలవానిగ, నిశ్చితమయిన మనసు కలవారిగ వుండి సుఖసంతోషములు, ఆరోగ్య సౌభాగ్యములు పొందగలడు. శుక్రునికి అంతర్దశలలో ఈ యోగము కలిగిన జాతకుడు వజ్రము ధరించిన త్వరలో ఫలితములు విశేషముగ వుండగలిగే అవకాశముంది.

కన్యాలగ్నమునకు శుక్రుడు ద్వితీయ, నవమాధిపతి. కన్యాలగ్నాధిపతి బుధుడు శుక్రునికి మిత్రుడు. మిత్రుడయిన శుక్రుడు ధన, భాగ్య స్థానములందు వున్నపుడు (నవమ స్థానము, కోణము) వజ్రము ధరించిన అంతులేని సంపద, సత్ పుత్రులను, మంచి అదృష్టము, గొప్ప పాండిత్యము, పిత్రార్జితములను కలగజేసి పలుకుబడి , గౌరవములను చేకూర్చును. శుక్రుడు ద్వితీయ, నవముల యందును, శుక్రదశ అంతర్దశలందు ఈ ఫలితములు ఎక్కువగా వుండగలవు. లగ్నాధిపతియైన బుధుని రత్నమయిన పచ్చను, వజ్రమును కలిపి ధరించిన దీర్ఘాయువుగ, తలపెట్టిన కార్యములన్నియును విజయవంతముగా నెరవేరగలవు.

తులా లగ్నమునకు శుక్రుడు లగ్న అష్టమాధిపతి. ఈ లగ్నమునకు శుక్రుడు శుభుడు. వజ్రము ధరించుట వలన మంచి ఆరోగ్యము, జీవితములో మనోరథసిద్ధి కలుగును. శుక్రమహాదశ, అంతర్దశలందు వజ్రము ధరించుట వలన చాలా ప్రయోజనకారిగా వుంటుంది. మొత్తము జీవితకాలమంతయు వజ్రము రక్షణ కవచముగా వుండగలదు. శుక్రుడు తులలో వున్నప్పుడు మాలవ్యయోగము కలగజేయును. వజ్రము ధరించుట వలన గ్రహస్థితిలో యిచ్చు ఫలితములు ఎక్కువగా వుండగలవు.

వృశ్చికలగ్నమునకు శుక్రుడు సప్తమ వ్యయాధిపతి. లగ్నాధిపతి కుజుడు, శుక్రునికి శత్రువు. అందుచేత వజ్రము ఈ లగ్న జాతకులు ధరింపరాదు. శుక్రుడు తన స్వస్థానమయిన సప్తమ వ్యయస్థానములు (7,12 స్థానములు) వున్నవుడు ధరింపరాదు.

ధనుర్లగ్నమునకు శుక్రుడు షష్ఠమ, లాభాధిపతి. ఈ రెండు ఆధిపత్యములు ఈ లగ్నమునకు శుభులు కారు. అశుభులు. ధనుర్లగ్నాధిపతి గురువు శుక్రునికి శత్రువు. అయినా శుక్రుడు తన స్వస్థానములయిన షష్ఠమ, ఏకాదశములందు, ఏకదశాధిపతి. లగ్నములో గానీ, ద్వితీయ, చతుర్థ, పంచమ, నవమము, దశమములో వున్నపుడు, శుక్రమహాదశయందుగానీ వజ్రము ధరించుట వలన శుక్రుడు ఆర్థిక లాభములు కలగజేయును. శుక్రుడు దశమమున వున్న అమలయోగమునకు కారకుడు. అందుచేత శుక్రమహాదశలో వజ్రము ధరించిన అమలయోగఫలితములు ఎక్కువగా కలుగును. మకర లగ్నమునకు శుక్రుడు పంచమ, దశమాధిపతి. అందుచేత శుక్రుడు ఈ లగ్నమునకు యోగము నీయగలడు. యోగకారకుడు.

అందుచేత వజ్రము ధరించిన ఈ జాతకులకు ప్రతివిషయము అనుకూలముగా వుంటుంది. వీరు వజ్రము తప్పక ధరించాలి. వాహన సౌఖ్యము, విద్యా విషయములో విజయము, గృహములో సౌఖ్యము, పిత్రార్జితము పొందగలుగుట, ధనమును సంపాదించుట లాంటి శుభఫలితములు పొందగలరు. మీన లగ్నమునకు శుక్రుడు తృతీయ, అష్టమాధిపతి. ఈ రెండు స్థానములు లగ్నమునకు అశుభులే. మీన లగ్నాధిపతి శుక్రునికి శత్రువు. శుక్రుడు తన స్వస్థానములయిన తృతీయం, అష్టమములో వున్నపుడు వజ్రము ధరించరాదు.

వజ్రము చాలా విలువ కలది. 1 క్యారెట్ బరువు గల వజ్రము ఉపయోగించవచ్చును. దీనిని ప్లాటినమ్ (లేక) వెండి యందు వుంచి ధరించాలి. కుడిచేతి చిటికెన వ్రేలుకి ధరించాలి. శుక్రవారం సూర్యోదయానంతరము క్రింద గల మంత్రము 108 సార్లు జపించి ధరించాలి.

మంత్రము - ఓం శుం శుక్రాయనమః

వజ్రమును కెంపుతో గానీ, ముత్యము, పగడము, కనకపుష్యరాగములతో కలిపి ధరించరాదు.

## ఎవరు నీలమును ధరించాలి :-

నీలము (నీలమణికి) ఆధిపత్య గ్రహము శని. జాతక చక్రములో శని శుభస్థానములందు వున్నపుడు మాత్రమే నీలము ధరించాలి. శుభ స్థానాధిపతియైన శని పాప స్థానములో వున్నపుడు గానీ నీలము ధరించుట వలన శని వలన కలుగు చెడు ఫలితములు తటస్థముగా నుండగలవు. నీలము ఎక్కువగా శుభఫలితములు నివ్వగలదు. జాతకునికి సరిపడనిచో ఆ జాతకుని జీవితము నాశనము కాగల అవకాశములు ఎక్కువ వున్నవి. జాతకునికి సరిపోయిన నీలము ఒక్కోసారి చెడు ఫలితములు కూడా ఇవ్వగలదు. అంతేకాక నీలము కొంతకాలము దగ్గర వుంచి పరీక్షించి ధరించుట మంచిదని జ్యోతిష్య శాస్త్రవేత్తల అభిప్రాయముగ వున్నది.

## ఎవరికి నీలము :-

మేషలగ్నమునకు శని, దశమ, ఏకాదశాధిపతి. రెండూ శుభ స్థానములే. అయినను ఏకాదశస్థానము శుభము కాదు. కాబట్టి శని ఈ లగ్న జాతకులకి పూర్తిగా శుభకారకుడు కాదు. శని ద్వితీయ, చతుర్ధ, పంచమ, సప్తమ (ఉచ్ఛయందు) నవమ, దశమ (స్వస్థానము) ఏకాదశము (స్వస్థానము) లలో ఉన్నపుడు మాత్రమే నీలము ధరించిన శని మహాదశ యోగించగలదు. సప్తమమయిన తులా లగ్నమునందు ఉచ్ఛను పొందిన శని, దశమమున స్వస్థానమున వున్నను శని మంచి యోగము కలగజేయును. ఈ యోగఫలితముగా జాతకుడు తనకింది వారిని శాసించువానిగా

నవగలడు. గ్రామమునకు, పట్టణమునకుగానీ, శాసింపగల శక్తి కలిగి వుండును. ఇతరులపై ఆధిపత్యము ఈ జాతకుడు వహించగల అవకాశములు ఎక్కువగా వున్నవి. ఇతరుల ధనముపై ఆధిపత్యము కలిగి వుండును. క్రూర స్వభావము కలిగి వుండును. ఇతని గుణములు ప్రశ్నార్ధకమగును. నీలము ధరించిన ఈ ఫలితములు వృద్ధి కాగల అవకాశములు ఎక్కువగా వున్నవి.

వృషభలగ్నమునకు శని నవమ, దశమాధిపతి. వృషభలగ్నాధిపతి శుక్రునికి మిత్రుడు. శని వృషభలగ్నమునకు యోగ కారకుడు. కావున వృషభలగ్నజాతకులు నీలమును ధరించాలి. నీలము ధరించిన ప్రభుత్వ అధికారుల నుండి ఆదరణ, వృత్తిలో ముందుండి పేరు ప్రతిష్టలు గౌరవ మర్యాదలు కలిగి వుండుట, ఎల్లప్పుడు సుఖ సంతోషములను కలిగి వుండుట లాంటి ఫలితములు అనుభవించగలరు. వజ్రముతో కలిసి నీలము ధరించిన విశేష ఫలితములుండగలవు.

మిధున లగ్నమునకు శని అష్టమ, నవమాధిపతి. తొమ్మిదవ స్థానము కోణము కాబట్టి ఈ లగ్నమునకు శని యోగదాయకమని చెప్పవచ్చును. శని మహాదశయందు నీలము ధరించిన లాభము కలుగును. మిధున లగ్నాధిపతి బుధుడు, శనికి మిత్రుడు. అందుచేత పచ్చతో కలిపి నీలము ధరించిన విశేష ఫలితములు కలుగును.

కర్కాటక లగ్నమునకు సప్తమ, అష్టమాధిపతి. కర్కాటక లగ్నాధిపతి చంద్రుడు శనికి శత్రువు. సప్తమ స్థానము మారకము కలగజేయు స్థానము. అష్టమము ఆయుష్షు తెలిపే స్థానము. అయినా శని ఆయుఃప్రమాణము కాపాడు గ్రహము. కానీ ఈ సప్తమ, అష్టమములు దుస్థానములు కావు. ఈ లగ్నజాతకులు నీలము ధరించరాదు.

సింహలగ్నమునకు శని షష్టమ, సప్తమాధిపతి. సప్తమము మారకము. షష్టమము రోగకారణము. లగ్నాధిపతి రవికి శని శత్రువు. షష్ఠ, సప్తమములు రెండు అశుభస్థానములయినందువలన సింహలగ్నజాతకులు నీలము ఎట్టి పరిస్థితులలోను ధరింపరాదు.

కన్యాలగ్నజాతకులకు శని పంచమ, షష్ఠాధిపతి. పంచమ కోణాధిపత్యమున శని పూర్తిగా అశుభుడు కాడు. పైగా లగ్నాధిపతికి శనికి మిత్రుడు. కావున శని మహాదశయందు ఈ జాతకుడు నీలము ధరింపవచ్చును.

తులా లగ్న జాతకులకు శని చతుర్ధ పంచమాధిపతి. పంచమకోణస్థితి శుభము. తులా లగ్నాధిపతి శుక్రుడు, శనికి మిత్రుడు. అందుచేత శని ఈ లగ్నమునకు యోగకారకుడు. నీలము ధరించుట వలన ఎక్కువగా శుభఫలితములు పొందగలరు.

వజ్రముతో కలిపి నీలము ధరించిన ఫలితము ఎక్కువగా వుండే అవకాశముంది. నవమాధిపతియైన బుధుని రత్నము పచ్చను కూడా కలిపి ధరించిన విశేష ఫలితములు పొందవచ్చును.

వృశ్చికలగ్న జాతకులకు శని తృతీయ, చతుర్థాధిపతి. ఈ లగ్నాధిపతి శనికి శత్రువు. అయినను చతుర్థాధిపతి యైనందు వలన, శని చతుర్థములో వున్న ససయోగము కలగగలదు. అందుచేత పంచమము, నవమము, దశమము, ఏకాదశముమున శని ఎక్కడ వున్నా శని మహాదశ యందు అవసరమయిన నీలము ధరింపవచ్చును.

ధనుర్లగ్న జాతకులకు శని ద్వితీయ, తృతీయాధిపతి. లగ్నాధిపతి గురువునకు మిత్రుడు ద్వితీయము మారక స్థానము. కావున నీలమును ఈ లగ్నము వారు ధరించరాదు. శనిలగ్నమున వున్న యెడల బృహత్ జాతకములో మహాయోగమని చెప్పియున్నారు. జాతకమున లగ్నగతుడయిన ధనుస్సు, మీనము, కుంభము, మకరము, తుల ఏదైనను ఆ జాతకుడు రాజకీయముగ అత్యున్నత స్థానము నలంకరింపగలడు. ఒక గ్రామాధికారిగానీ, నగరమునకు మేయర్‌గా గానీ, పట్టణమునకు మునిసిపల్ చైర్మన్‌గా గానీ, గొప్పవేదాంతిగా గానీ వుండవచ్చును. ధనుర్లగ్నజాతకులకు శనిలగ్నమునందున్నప్పుడు నీలము ధరించిన ససయోగము వలన కలుగుఫలితములు కలిగే అవకాశముంది.

మకరలగ్నమునకు శని లగ్న, ద్వితీయాధిపతి. అందుచేత జీవిత పర్యంతము నీలము ధరింపవలెను. అది రక్షణ కవచము వలె నుండగలదు. నీలము ధరించిన మంచి ఆరోగ్యము, దీర్ఘాయువు, అభివృద్ధి, భాగ్యము, సంతోషము, కార్య సఫలత కలగగలదు. వజ్రముతో కలిపి ధరించిన మిక్కిలి అనుకూల ఫలితములు కలగగలవు.

కుంభలగ్నమునకు శని లగ్న వ్యయాధిపతి. వ్యయాధిపతి అయినా లగ్నాధిపత్యమున్నది. కనుక లగ్నమునకు శుభుడు. మిక్కిలి యోగకారకుడు. జీవితకాలము నీలము ధరించుట వలన మంచి ఫలితములు కలుగగలవు. ఈ లగ్నజాతకులు భూములను సంపాదించగలరు. భాగ్యాధిపతి శుక్రుడు అయినందువలన వజ్రముతో కలిపి నీలము ధరించిన విశేష ఫలితములు పొందవచ్చును.

మీనలగ్నమునకు శని ఏకాదశ, ద్వాదశధిపతి. లగ్నాధిపతికి మిత్రుడయినా ఈ లగ్నమునకు శని శుభుడే. శని ఏకాదశమున, లగ్నమున వున్న, శని మహాదశయందు నీలము ధరించిన పైన పేర్కొన్న ససయోగమున పూర్తిగా శుభఫలితములు పొందవచ్చును. లగ్నగతుడయిన శని యొక్క శుభఫలితములు పైన పేర్కొన్నవి జరగగలవు.

నీలము 5 క్యారెట్లు వుండాలి. ఇనుముతో కలిపి ధరించాలి. అష్టధాతులోహముతో శనివారము చేయించి క్రింద మంత్రము 108 సార్లు జపించి కుడిచేతి మధ్యవేలుకి సూర్యాస్తమయమునకు గంటముందు ధరించాలి.

మంత్రముః- ఓం శం శనైశ్చరాయనమః

కెంపు, ముత్యము, కనక పుష్యరాగములతో నీలమును కలిపి ధరించరాదు.

## గోమేధికమును ఎవరు ధరించాలి :-

రాహుకేతువులు ఛాయాగ్రహములు. ఏ స్థానములకు అధిపతులుకారు. జ్యోతిష్యశాస్త్రవేత్తలందరూ రాహూకేతువుల గురించి ఒకే విషయమును వివరించుచున్నారు. రాహుకేతువులు ఏ భావమునైతే ఆశ్రయింపబడుచున్నారో ఆ భావఫలితములు కలుగును. రాహువు ఏ నక్షత్రము పై గలడో ఆ గ్రహ ఫలితములనే ఇచ్చుచున్నాడు. ఎలాగంటే జాతకునికి అతని జాతకమున కృత్తిక నక్షత్రము శుక్రునకు చెంది మేషరాశిలో వున్నది. జాతకునిలగ్నము కన్య. అయిన కన్యకు మేషము అష్టమ రాశి. అష్టమము కష్టములు కలిగించు స్థానము. ఈ కష్టములు ఏ విధంగా వుండునంటే ద్వితీయ, నవమాధిపతి శుక్రుడు కనక శుక్ర నక్షత్రముపై ఉన్న రాహువు కుటుంబమును, పితృ, భాగ్యమును నష్టపరచగలడు. అంతేకాక ఈ నక్షత్రముపై నున్న రాహువు, శుక్రుడివ్వ గలిగిన స్త్రీ సాంగత్యము, అష్టమము అగుట వలన ద్వికళత్రము నిచ్చుయోగము కలగజేసి జాతకుని కష్టములు పాలు చేయగలడు. ఇది రాహుదశయందు విపరీతముగ కనిపించగలదు. రాహుకేతువులిరువురును. ఈ విధముగనే భావమును ఆశ్రయించి నక్షత్ర అధిపతిని కలుపుకుని ఫలితముల నివ్వగలరని తెలియుచున్నది.

రాహువు జాతకమున శుభలగ్నమును గానీ, శుభస్థానముగానీ ఆశ్రయించి గానీ, శుభస్థానముగానీ ఆశ్రయించి ఉన్న రాహువు శుభ ఫలితముల నివ్వగలడు. అటువంటప్పుడు రాహువునకు ఆధిపత్యము గల గోమేధికము ధరించిన ఉత్తమ ఫలితములు కలగ గలవు. అంతే కాక రాహు మహాదశ, అంతర్దశలలో బాగా ఫలితముండగలదు. రాహువు 3,6,11 స్థానములందు తప్ప మిగిలిన స్థానములన్నియి చెడు ఫలితముల నివ్వగలవు. అంతేకాక రాహుకేతువులు వివిధ లగ్నములకు, వివిధ రకముల ఫలితములను ఇవ్వగలరని జ్యోతిషశాస్త్రవేత్తలు తెలిపినారు.

రాహువు తృతీయ, షష్ఠమ, ఏకాదశ స్థానములందున్న జాతకుడు గౌరవమును పొందగలడు. భాగ్యము, దీర్ఘాయువును పొందగలరు. సోదర సోదరీలయందు ప్రముఖునిగా వుండగలడు. ఋణబాధలు లేనివానిగ, రోగ రహితముగ వృత్తి యందు అభివృద్ధి కలిగి సంపాదన కలుగును. రాహువు 3, 6, 11 స్థానములందున్న రాహువు మహాదశ, అంతర్దశలయందు జాతకుడు గోమేధికము ధరించిన యెడల మేలు కలగగలదు.

వృషభము రాహువుకి ఉచ్ఛ స్థానమని తెలుపుచున్నారు కొందరు జ్యోతిషశాస్త్రవేత్తలు. రాహువునకు కోణాధిపత్యము వచ్చిన, శుక్రుడు ఈ జాతకమునకు శుభుడైన రాహువు విపరీతమయిన విశేషముగ లాభకరము గల ఫలితములు నివ్వగలడు. గోమేధికము ధరించిన రాహువు మహాదశ యందు అంతర్దశ యందు విశేష ఫలితములు కలుగును.

కొన్ని జ్యోతిషశాస్త్ర గ్రంధముల ప్రకారము రాహువునకు కేంద్ర స్థితి కలిగి కోణాధిపతితో కలిసి వున్న రాహువు యోగకారకుడని చెప్పుచున్నారు.

రాహువు ద్విస్వభావ రాశి నాశ్రయించి ఈ రాశులు చతుర్థాధిపతికి గానీ, కోణాధిపతికి గానీ సంబంధించినవయిన రాహుమహాదశ అంతర్దశల యందు ధనము, అధికారము కలగగలదు. రాహువు ఒక కోణాధిపతి. నవమ, దశమ స్థానములందువున్న ఆ జాతకునికి భాగ్యము నివ్వగలడని తెలియుచున్నది. రాహువు కోణాధిపతితో కలిసి వున్న ఈ విధమయిన ఫలితము కలుగును. రాహుదశ, కలిసియున్నటు వంటి కోణాధిపతి దశ రెండునూ యోగింపగలవు. శుభ స్థాన యతిలేని గ్రహము, దుర్యోగమయిన రాహువుతో కలిసిన ఆ గ్రహ దశాంతర్దశలు వ్యతిరేకముగ వుండగలవు.

రాహువు యోగకారకుడయిన అతని అంతర్దశలయందు గోమేధమును ధరించుట వలన ఫలితములు విశేషముగ వుండును.

వెండితో తయారుచేయించిన కుడిచేయి మధ్య వ్రేలికి ధరించాలి. బుధవారం రోజు సూర్యోదయమునకు ముందు ధరించిన మంచి ఫలితములు కలగగలవు. కనీసము 2 క్యారెట్లు వుండాలి. గోమేధికము, కెంపు, ముత్యము, కనకపుష్యరాగము కలిపి ధరింపరాదు. ఉంగరము ధరించుటకు ముందు 108 సార్లు క్రింది శ్లోకము జపించాలి.

మంత్రము :-

"అర్ధకాయం మహావీరం
చంద్రాదిత్యమధనం
సింహికాగర్భ సంభూతమ్
తం రాహుం ప్రణమామ్యహం"

## ఎవరు వైఢూర్యము ధరించాలి :-

కేతువు కూడా రాహువు వలెనే ఫలితముల నివ్వగలడు. కేతువు మోక్షకారకమయిన గ్రహము. ఫలితములు రాహువు కన్నను భిన్నముగ వుండును. కొన్ని పరిస్థితులలో కేతువు యోగస్థానమున వున్నను ఏ విధమయిన ఫలితము యివ్వక తటస్థముగ వుండవచ్చును.

కేతువునకు వృశ్చికము ఉచ్ఛరాశి. కుజుడు శుభస్థానగతుడయి వున్నయెడల మంచిఫలితములు పొందగలరు. కేతువునకు కూడా రాహువు వలెనే యోగములు కలుగుచున్నవి. శుభస్థానములందున్న కేతువు శుభఫలితముల నిచ్చును. వైఢూర్యము ధరించుట వలన విశేష ఫలితములుండును.

వైఢూర్యము గురు, శని వారము లందు వెండితో తయారుచేయించిన వైఢూర్యపు ఉంగరము ధరించాలి. సూర్యోదయమయిన గంటలోగా ధరించుట మంచిది. 2 క్యారెట్ల బరువు తగ్గకుండా వుండాలి. కెంపు, ముత్యము, కనకపుష్యరాగములతో కలిపి ధరించరాదు. ధరించుటకు ముందు క్రింది స్తోత్రము 108 సార్లు జపించాలి.

మంత్రము: "ఫలాశ పుష్ప సంకాశం, తారకాగ్రహ మస్తకం, రౌద్రం,
రౌద్రాత్మకం, ఘోరం తం కేతు ప్రణమామ్యహం"

